శ్రీరస్తు:

శ్రీ శారదాంబాయై నమః

# ఆర్యోక్తి సప్తశతి

## తెలుఁగు సామెతలు

ద్వితీయ భాగము.




రచయిత :

శిరోమణి, నూకల సత్యనారాయణ శాస్త్రి,

ప్రధానాంధ్రోపాధ్యాయులు, అయిజా హైస్కూలు,

మలకపేట, హైదరాబాదు (ఆంధ్రప్రదేశ్:)






[ వెల 1-12 న. పై.

ప్రథమ ముద్రణము
2000 ప్రతులు
★

విలంబి సం॥ దేవీ నవరాత్రులు
1879 శాలివాహన శకః
20-10-1958

ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వముచే సమస్త గ్రంథాలయములకు, హైస్కూళ్ళకు, కాలేజీలకు "అప్రూవ్" చేయబడినది.

**R. C. No. 227 (M 4) 58 Dated 1—11—1958**

ఇయ్యది
శిరోమణి చివుకుల అప్పయ్య శాస్త్రి గారి
శ్రీనివాస ముద్రణాలయమున ముద్రింపబడినది
సికింద్రాబాద్ (ఆం. ప్ర.)

ర చ యి త



శి రో మ ణి

నూ క ల స త్య నా రా య ణ శా స్త్రి

# కృతిసమర్పణము



శ్లో॥ శ్రీ "మూకల" కులోద్భూత "సత్యనారాయణేన" సత్
ఆర్యోక్తీనాం సప్తశతం లలితాయై సమర్పితమ్॥

కం. "ఆర్యోక్తి సప్తశతి" నే
నార్యా! నీ కంకితముగఁ నర్పింతును, నా
కార్యం బవసిత మయె, నా
హార్యముగాఁ గొనుము దీని నంబా! లలితా!

కం. ఎనమిది కోశ సుమమ్ముల
మనసార యొసంగినాఁడ, మంగళదాత్రీ!
కొను లలిత! శతక సప్తక
మును "చంద్రున కొక్క నూలుపోగగు" మాడ్కిన్

గ్రంథకర్త.

# తొలిపలుకు

శ్రీదేవీ కటాక్షమున తెలుఁగు సామెతల ద్వితీయ భాగమును ఆంధ్ర సోదరుల కర కమలము లందు సమర్పించి నా సంకల్పమును సాంతము చేసికొని కృతకృత్యుఁడ నైతిని.

ఇరువది సంవత్సరముల నా అనుభవములోను 6 వ తరగతి మొదలు 10 వ తరగతి వరకు గల విద్యార్థులకు నీతి పద్యములను భర్తృహరి నుండియే గ్రహించి దానినే క్రిందు మీదు చేసి పాఠ్యభాగముగా నిర్ణయింప బడుచుండెను. ఇది మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు దుర్వగాహముగా నుండెడిది. అట్టి లోపమును తీర్చుటకు సులభ శైలిలో దీనిని వ్రాసినాను. నా కృషిలో నే నెంత సఫలత నందితినో పాఠకులే నిర్ణయింతురుగాక.

దీనిలో కొన్ని స్థలము లందు వ్యాకరణ విరుద్ధములును, నపశబ్దములును లోకములోని వాడుక ననుసరించి తెలిసియే వ్రాయబడినవి. ఉదా. ఉత్సవిగ్రహము=ఉత్సవ విగ్రహము మొదలగునవి.

నాకీ కార్యమున సహాయము చేసిన మిత్రులకు, నాకు అభిప్రాయముల నొసఁగిన సజ్జనులకు నా నమోవాకములు.

గోలకొండ, బాల, కుసుమ హరినాథ, దివ్యవాణి, జ్ఞానతరంగిణి పరివ్రాట్టు మొదలగు పత్రికాసంపాదకులు నా పద్యములను, నా, వ్యాసములను సకాలమున ప్రచురించి నాకు ప్రోత్సాహము నొసఁగినందులకు నేను సర్వదా వారికి కృతజ్ఞుడను.

ఆంధ్రప్రభుత్వము నా తెలుఁగు సామెతలను, రెండు ఏకాంకికలను ఆర్యోక్తి సప్తశతిని గ్రంథాలయములకు, హైస్కూల్లకు కాలేజీలకు "అప్రూవ్" చేసినందులకు నేనెంతయు కృతజ్ఞుడను.

నాలోపములను తెలిపినచో ద్వితీయముద్రణమున సరిచేసికొనగల నని మనవి చేయు చున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త.

బ్రహ్మశ్రీ గుండేరావుగారు, హర్కారేగారు, P.O.L.
హిందూరా, P.O.L. సాహిత్య, వాచస్పతి, శిరోమణి,
విద్యాభూషణ. విద్యాభాస్కర, రిటైర్డు సెషన్సుజడ్జిగారి
అమూల్యాభిప్రాయము. శాలిబండ, హైదరాబాదు. ఆం ప్ర.

శ్రీమాన్ ఋషి. శిరోమణి నూకల సత్యనారాయణ శాస్త్రి గారిచే రచింపబడిన "అన్యోక్తి సప్తశతి" యను నామాంతరము గల "తెలుగు సామెతలు" అను పద్యకావ్యమును నేను బహూత్సాహముతో రెండు భాగములను చదివి చూచితిని.

దీనిలో సంస్కృతమున గల కొన్ని నీతిబోధకములగు శ్లోకములకు చక్కని అనువాదక పద్యములు కలవు.

లలిత లలితమును, మృదుమధురమును, సులభము నగు శైలిని ఆంధ్రభాషా వ్యవహారమునందు గల వేయి సామెతలను పద్యములలో కూర్చియున్నారు. ఇవి ఆంధ్రభాష నెఱిగినవారి కందరికిని మిక్కిలి యుపయోగకర మైనది. ఇవి యొక యుత్కృష్టమైన రచన. అపూర్వము.

శ్రీ శాస్త్రిగారు ప్రసిద్ధులైన వేద పాఠకులు. శ్రౌతమునందు అసదృశ పాండిత్యము కలవారు. ఇది యిటువంటియు సరస కవితా రచనా పాటవము కలవారగుట పరమాశ్చర్యము!

ఈ సరస సులభమగు రచన బాల బాలికలకును, అన్నితరగతుల విద్యార్థులకును బోధపరచిన యెడల భావి సంతతి కొక నైతిక బలము చేకూరగలదనియు. తద్వారా సమాజోన్నతి సమకూడగలదనియు నా విశ్వాసము. ఆంధ్రుల కవశ్య పఠనీయము.

ప్రథమ, మధ్యమ, ఉన్నత పాఠశాలల లోను, కళాశాలలలోను, పాఠ్య గ్రంథముగా ప్రభుత్వ మంగీకరించినచో సకల జనోపయోగము కాగలదు. అందరికి నుపయుక్తములగు విషయము లిందు గలవు.

ఇట్టి పరిశ్రమ సలుపుచు లోకోపకారమును, భాషాసేవను చేయు శ్రీ శాస్త్రిగారి కృషి మిగుల ప్రశంసనీయము. వారు "వేదసూక్తులను" అచిరకాలములోనే చదువరుల కందజేయుదురని ఆశించుచున్నాను.

# అష్టదిగ్గజముల అమూల్యాభిప్రాయములు

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, M. A.
ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు డిపార్టుమెంటు హెడ్.

శ్రీ దివాకర్ల వెంకటావధాని, M.A.Ph.D.
ఉస్మానియా విశ్వవిద్యాల యాంధ్రోపన్యాసకులు:

శ్రీ శిరోమణి, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు,
అసిస్టెంటు డైరెక్టరు, సమాచార పౌరసంబంధశాఖ, హైదరాబాదు.

శ్రీ శిరోమణి చరమచర్ల రంగాచార్యులుగారు,
ఆంధ్రోపన్యాసకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

మహాకవి శిరోమణి, శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు,
దివ్యవాణీ పత్రికా సంపాదకులు, శికింద్రాబాదు.

విద్వాన్, సరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారు, M·A.
విద్వత్కవిరాజ, కవికులశేఖర, ప్రాచ్యసాహిత్య ప్రవీణ,
నిజాంకాలేజీ ఆంధ్రోపన్యాసకులు, హైదరాబాదు, (ఆం.ప్ర.)

బ్రహ్మశ్రీ కురుగంటి సీతారామయ్యగారు, M.A.
నిజాంకాలేజీ ఆంధ్రోపన్యాసకులు, శ్రీ భట్టాచార్య బిరుదాంకితులు
హైదరాబాదు

శ్రీ బిదురు వెంకటశేషయ్యగారు, B.A.
ప్రధానాంధ్రోపాధ్యాయులు, మహబూబుకాలేజీ హైస్కూలు,
శికిందరాబాదు.

వీరి అభిప్రాయములను "తెలుగు సామెతలు"
మొదటి భాగమున నాడుడు.

# విషయ సూచిక



---

# సవరణలు

పద్యం తప్పు ఒప్పు

4: దుత్తు=దుత్త, 7: పన్న=సన్న, 8: గడగబ=గడబడ 19: బ్రాతృ=భ్రాతృ, 37. నమ్మ్మ=నమ్మ, 54. దగ=దగ్ధ, అది=అద్ది, 108 విష=విషు, 119. విందు కడుపు=విందు కుడుపు. 119: మెప్ప=మెప్పు, 122. జేయు=జేయ, 125. నసుట=ననుట, 181. కుట్లు=నట్లు, 204, బిడ్డ=బిడ, 233. పొటను=పొగను, 243: నవమా?=నవమె? 254. పైమ్య=వైమ్య, 256. జణకుఁడు=జనకుఁడు, 268. కషము = కష్టము, 268. నిరిపురి=నిరువురి, 275, కబళమదెదె=కబళమంచె, 276. ధరణ=ధరణి, 277. దీర్ఘాయువట=దీర్ఘాయువలు.

అడ్రసు:— శిరోమణి నూకల సత్యనారాయణ శాస్త్రి,
గద్వాల హౌస్, నాంపల్లి, హైదరాబాదు.

శ్రీశారదాంబాయై నమః

# ఆర్యోక్తి సప్తశతి

## తెలుఁగు సామెతలు
## ద్వితీయ భాగము



### కావ్య పద్ధతి

కం. శ్రీవిద్యకు, శ్రీమాతకు,
శ్రీ విద్యాదేశికునకు, శ్రీ చక్రము కున్
శ్రీ విద్యోపాసకునకు,
నేవిధ మగు భేద మైన నెన్నందగునే ? 1

ఆ. వె. కవులలోన నాది కవియగు వాల్మీకి
దేవులందు నాది దేవుఁ డాది
దేశగణన నాంధ్ర దేశమే యగు నాది
దేశభాషలందు తెలుఁగె ఆది (లెస్స) 2

ఆ. వె. ముద్దు సుద్దు లుండె ముక్కోటి యాంధ్రుల
ముద్దు మోములందు, పద్దె మందు
కూర్చితిని వానిఁ బేరుఁగా శతకము
"తెనుఁగు సామెత" పువ్వు దేనె చినుకు. 3

ఆ. వె. బంగ రొకటె చూడ వరభూషణము లెన్నొ
భావ మొకటె చూడ భాష లెన్నొ !
మృత్తు చూడ నొకటె దుత్తు లెన్నియొ; బ్రహ్మ
దేవుఁ డొకఁడె చూడ జీవు లెన్నొ ! 4

ఆ. వె. తేనె లొలుకు నట్టి తెనుఁగు సామెత విని
ముద్దు లొలుకఁ బలుకు ముదితఁ జూచి
ఎవని మదికి వికృతి చివురింపదో వాఁడు
పరమ యోగియొ ! నరపశువొ సుమ్మొ ! 5

కం. బంగారముఁ గని కవితా (వనితా)
శృంగారము వినియు నెవని చిత్తము లోనన్
కంగారు పుట్ట కుండునొ
సంగవిహీనుండొ! శుకుఁడొ! షండుఁడొయతఁడొ.

ఆ. వె. సాహితీ రహితుఁడు సాక్షాత్పశువె యగు,
పుచ్ఛ శృంగ రహిత పురుష మృగము
తృణముఁ దినకఁ దాను ధీర్ఘాయువగు సన్న
భాగధేయ మద్ది పశు వితతికి ! 7

ఆ. వె. చెప్పు మనకయె కవి చెప్పఁడు సూక్తులన్
చెప్పుకున్న వినఁడు గొప్ప జేఁడు,
చెప్పువాఁడు లేక చెడును పామరుఁడు, నీ
గడగబఁ బడి నడుమ చెడును నుడులు. 8

కం. శృంగార మెఱుఁగుఁ బళువులు
భృంగము, లురగములు, నరులు, విబుధులు, మునులున్,
శృంగార మయము కావ్యము
శృంగారము నొల్లకుండు జీవియుఁ గలదే ! 9

ఆ. వె. సురల వసతిఁ జూడ సురలోక మందున
నరుల వసతిఁ జూడ ధరణి యందు
ఏది మధుర తరమొ, యెవరు తెల్పుదురు ? మా
కావ్య రసమొ, సురల దివ్య సుధయొ ! 10

ఆ. వె. ఇక్షుదండ ముండ భిక్షు కక్షము నందు
దాని మధుర రసము హీన మగునె !
ఆర్యసూక్తి యుండ నజ్ఞుని ముఖమందు
దాని మధుర రసము హీన మగునె ! 11

ఆ. వె. ఏది వినఁగఁ గవుల హృదయముల్ తరళమౌ
కవిత యనుచు ఘనతఁ గాంచు నద్ది,
ఎవతెఁ గనఁగ రసిక హృదయముల్ తరళమౌ
వనిత యనుచు దాని ననఁగ వచ్చు. 12

ఆ. వె. సుజనులార ! వినుఁడు సురలోకమున సుధా
రసము కలదు, మన, కలభ్య మద్ది
కావ్యరసముఁ గ్రోల భావ్యమౌ, విన రండు
తెలుఁగు భాషలోని తీయఁదనము. 13

ఆ. వె. పదము లవియె, యర్థ భావాదు లవియె, యా
కావ్యవస్తు వదియె, కావ్య మదియె
కవులు గ్రథన చేయు కౌశలమును బట్టి
నవ్య మగుచు నుండుఁ గావ్య మెపుడు. 14

ఆ. వె. సభలలోన సమయ సందర్భ యుత మగు
భాషణమ్ము మిగుల భూషణమ్ము
శయన సమయమందు శశిముఖి తగు రీతి
భూష లేక యున్న భూషణమ్మె ! 15

ఆ. వె. రసవిహీన మయ్యు రామనామాంకిత
మగుచు కవిత భక్తి నమరెనేని
ప్రస్తుతింపఁ బడును, భక్తవర్యులచేత
ముత్తతోడ నున్న శుక్తివోలె. 16

ఆ. వె. అన్నపానములును, నార్యసూక్తులును, న
మూల్య రత్నము లివి మూడు భువిని
మూఢుఁ డుత్తమ మగు మూటిని విడనాడి
జాతి ముక్క నమల రత్న మనును ! 17

ఆ. వె. సామెత మధురిమకు సాటి రాఁజాలక
ముందుగానె ద్రాక్ష మోము ముడిచె
సుధయు నీర మగుచు సురలోకమునఁ దాగె !
కండ చక్కెర వెలి గడ్డ కట్టె ! 18

ఆ. వె. తస్కరులకుఁ గాదు, ధరణీశులకుఁ గాదు
భ్రాతృ విభజనమునఁ బాలు కాదు
భారకారి కాదు పంచఁగా వృద్ధియౌ
విద్యఁ బోలు ధనము వేఱు గలదె! 19

ఆ. వె. మంచి విద్యయున్న మనిసి చింత పడనేల?
నీచమైన కుక్షి నింపు కొనఁగ
పక్వఫలము లెన్నొ బడయదే భక్షింప
రామచిలుక? "రామ రామ" యనుచు. 20

ఆ. వె. గ్రథన భేదముననె రసవిశేషము కల్గు
క్రమ కోమల మగు కావ్యమునకు
గ్రథన భేదముననె రసవిశేషము కల్గు
ఆమ్ల కఠినమైన యాభ్రమమునకు. 21

ఆ. వె. ప్రీతిఁ గొలుపు నాట వెలఁదియె కన విన
కవితలందెగాని కాంతలందు
మహిని భీతిఁ గొలుపు మత్తేభ, శార్దూల
ములు కన విన వనుల పుస్తకముల. 22

నీతి పద్ధతి

కం. తన తిండి తాను దిన్నను
తన బట్టను తాను గట్టి తాఁ దిరిగిన, నీ
జను లెల్లఱు తన్నేమని
యనుచుందురొ, యనుచు వెఱచు టదియు క్తంబొ.

ఆ. వె. ఇంటనుండు వాని కిల్లాలు హితవరి
ఇతర దేశగతున కితవు విద్య
వ్యాధి పీడితులకు వైద్యుఁడు హితవరి
చావజోవు వాని కీవి హితము. 24

ఆ. వె. తెల్ల కాకి నైన తిరిగి పట్టఁగ వచ్చు
మేడి పూలనైనఁ జూడ వచ్చు
మీను కాళ్లు నీట కాంచ వచ్చును, కాని
ఆడుదాని యెడఁద చూడ నగునె! 25

ఆ. వె. కాచు శీతమునను, గాచు వాతమునను
కాచు నాతపమునఁ గాచు లజ్జ
భూషణముల కాది భూషణ మగు వస్త్ర,
మార్యసభ్యత కని వార్య మద్ది. 26

ఆ. వె. కాచు చోరు నుండి కావుము చెదనుండి
నీళ్ల నుండి కావు నిప్పు నుండి
కాళ్లు, వ్రేళ్లు, కీళ్లు, కండ్లు, వెన్నును వంచి
కష్టమునను వ్రాసె కావ్య మెవరో! 27

ఆ. వె. వహ్ని కీల నార్ప వారిధారయె మందు,
మండుటెండ మాన్ప మందు గొడుగు
మాన్ప సర్ప విషము మణి మంత్రములు మందు
మందు కలదె! ఖలుని మార్పు చేయ? 28

ఆ. వె. మదగజమును బట్టి మహి నంకుశము మందు
మహిషము నదలింప మందు బడియ
వ్యాధిఁ ద్రోల మందు వర రసాయనములు
మందు కలదె ఖలుని మార్పు చేయ ? 29

ఆ. వె. మకరి ముఖమునుండి మణిఁ బెఱకఁగ వచ్చు
సాగరమును దాటి చనఁగ వచ్చు
చెలువుమీర చిలువఁ దలను దాల్పఁగ వచ్చు
తులువ మనుజుఁ దనుప నలవ వశమె ! 30

ఆ. వె. లాలనమునఁ గలుగు లక్ష దోషమ్ములు
తాడనమునఁ గలుగు లక్ష గుణము
లందు వలన శిష్యు ననుఁగుఁ బుత్రునిఁ దగు
శిక్ష చేయవలయు గక్ష మాని. 31

ఆ. వె. పశువులందు, పక్షి, పన్నగముల యందు,
ముదిమి యందు, జారు బురద యందు,
శత్రు, రంధ్ర, శునక, జల, తిమిరము లందు
దండ మొసఁగు లబ్ధి దశవిధమ్ము. 32

ఆ. వె. చేని కీనె గట్టు, చానకు సిగజుట్టు,
కులసతి కగు లజ్జ కలిమి ముద్దు,
బాలకు పని ముద్దు, భాషకు నుడి ముద్దు,
పాలపా పఁడన్న ప్రజకు ముద్దు. 33

ఆ. వె. కన్న బిడ్డ నిచ్చి గాపించి పెండిలి
అల్లు నాదరించి యనుఁగుఁ దండ్రి
పాల కొఱకు ఱాతి బండ మోసిన రీతిఁ
గాని బరువు మోయు కూన కొఱకు. 34

ఆ. వె. ధాతు వనఁగ క్రియల జాతి భేదంబొండు
ధాతు వనఁగ స్వర్ణ ధాతు వొండు
ధాతు వనఁగ రక్త ధాతువుల్ తనువున
ధాతు హీనమైన ఘాతుకమ్ము. 35

ఆ. వె. పొత్తము, నవయువతి. విత్తమ్ము, పరహస్త
గతమయిన, నెఱుంగు, గత మటంచు
తిరిగి వచ్చెనేని త్రిక మనుక్రమముగాఁ
జిరుఁగు, జెడిపె యగును, చిల్లర యగు. 36

కం. జనని యె విషమిడ సుతునకు
జనకుఁడె తన తనయు నమ్మ సమకట్టంగన్
జనపతి యె కొల్ల గొట్టఁగ
కను "కంచెయె చేను మేయ కాచెడి దెవరో?" 37

ఆ. వె. పౌరససుతు నెఱుఁగు మౌర్ధ్వదైహిక మందు
భార్యత నెఱుఁగు ధన విభాగ మందు
భామ గుణము నెఱుఁగు లేమి కల్గిన నాఁడు
హితుని గుణము నెఱుఁగు మిడుములందు. 38

ఆ. వె. ప్రబలకోపము గల ప్రభువున కాత్మీయుఁ
డన్న వాఁ డొకండు సున్న, మిగుల
ప్రజ్వలించుచున్న వహ్నికి నాత్మీయుఁ
డన్న వాఁ డొకండు సున్న జగతి ! 39

కం. అర పదుగురు పతు లుండియు
నరయగ ద్రౌపది మనంబె యాజవ పతికై
పర వనితలు సతు లగుటకుఁ
బర పురుషాభావ మెన్న వర కారణమౌ. 40

ఆ. వె. శ్వేత హంసకు తన శిశువు ముద్దగు రీతి
నల్ల కాకికిఁ దన పిల్ల ముద్దు
ప్రేమ గ్రుడ్డి దగుటఁ బ్రియ సుతుని కురూపు
కన్న తల్లి యెట్లు గాంచఁ గలుగు? 41

ఆ. చెట్టు నాటు వాఁడె చేది పోయును నీరు
నారు పోయు వాఁడె నీరు పోయు
ప్రాణ మొసఁగు వాఁడె యన్నమ్ము నొసఁగుఁ గ
ల్ప్రావు వాఁడె యిచ్చుఁ దాడి పన్ను. 42

భ క్తి ప ద్ధ తి

ఆ. హమ్మ, హమ్మ, టంచుఁ బ్రాణవాయువుఁ గొని
"సస్స, సస్స" యనుచు శ్వాస విడిచి
సోఽహమేవ హంస,యనుచు "హంస స్సోహ"
మని జపించు జీవ హంస యెపుడు. 43

ఆ. ఆమడంత దూర మైన నంతఃకర
ణములు దూర మౌనె! తమక మున్న!
తనువు క్రోశదూరమున నున్న నేమాయె?
సంగమంబు హృదయ సంగమంబె! 44

ఆ. గాఢ భక్తి మదినిఁ గలుగఁ, గన్గవ నుండి
పారు నశ్రుధార లేఋ లగుచు
కన్ను లెఱ్ఱనైన మిన్నెఱ్ఱ నైనను
పారు నంబుధార లేఋ లగుచు. 45

ఆ. నూఱు జన్మములకు మారినను నరుండు
భక్తి కలిగె నేని బడయు ముక్తి
నూఱు వత్సరములు మారిన నీ జీవి
బ్రతికియున్న శుభముఁ బడయ వచ్చు. 46

ఆ. పూవు కారణమ్ము భువి ఫలములు గల్గ
ఫలము లొదవ పూలు పడును భువిని
కర్మ కారణమ్ము కలుగంగ జ్ఞానమ్ము,
జ్ఞాన మంకురింపఁ జనును కర్మ. 47

ఆ. పాప కర్మలు నరుఁ డోపికతోఁ జేయు
బాప ఫలముఁ గుడువ నోపకుండు.
పుణ్య కర్మ లుడిగి బుద్ధి పూర్వకముగఁ
బుణ్యఫలముఁ గుడువఁ బోవు నహహా! 48

కం. కొండంత పాప పుంజము
నిండుపు కాయంత భక్తి హెచ్చగుఁ గాల్పన్-
కొండంత దూది పింజను
బెండంతటి నిప్పు రవ్వ వెలిగించు గతిన్. 49

కం. కొండంతటి దైవమునకు
బెండంతటి బెల్లమే నివేదన కెచ్చో!
కుండెడు పాలను జేర్పఁగ
నిండుపు కాయంత తోడు హెచ్చగు రీతిన్. 50

జ రా ప ద్ధ తి

ఆ. వె. వృద్ధులైన భూప భిష గమాత్యుల, కతి
మాన మొసఁగును జర మేన నున్న
గణక, గాయక, గణికా, మల్ల, భృత్యుల
మేన నుండిన, యవమాన మొసఁగు. 51

ఆ. వె. దంత పంక్తి యొక్క ధావళ్యమును నీల
కేశ పాశము కొన, కినిసి పండ్లు
న్యాయ హీనమైన నది సహింపక జరా
సమయమందు దాగె గ్రమత భువిని. 52

ఆ. శీతకాలమందు శీత చంద్రికలను
గ్రీష్మకాలమందు నూష్మములను
ధర మనుజుని మనము దాయని విధమున
తరుణి మనసు వృద్ధు దరియఁబోదు. 53

ఆ. వె. కాల్పఁ గను జరాగ్ని గళిత యౌవన కాష్ఠ
ములను దేహ కుండమునను పలిత
మను నెపమునఁ దలను గనఁబడు నదియె, వై
శ్వానరాగ్ని దగ భస్మ మది! 54

ఆ. భక్తి కొఱకు వలయు వస్తుజాతము నెల్ల
ఒసఁగ భక్తి వీడి మెసవు పశువు!
అహహ! నీచుఁడు జనుఁ డంచు వార్ధక్యాన
దంతములను రాల్చె నంతకుండు. 55

ఆ. వె. ముదిమి యందుఁ దలను బోడ కట్టు ఫలితము
నెరసుఁ దనము కాటు నివురు భస్మ
భక్తి లేక నరుఁడు పాడౌటకుఁ గినిసి
బుగ్గి నెత్తి తలను బోసె శివుఁడు. 56

ఆ. వె. నరుని సగదుఁ జేయు హరిని వోలెను జర;
దండధరుని వోలె దండధరుని;
రుద్రుని వలె నిల విరూపాక్షునిఁగఁ జేయు,
పున్నె మేమి చేయ కున్న నహహా! 57

ఆ. వె. జరయె యముని దూతి చనుదెంచి మనుజుల
శిరము లందుఁ జేరి చెవుల యందు
చెప్పుచుండె వినుడు "చెడుగుల విడనాడి
హరి భజనముఁ జేయు తరుణ" మనుచు. 58

ఆ. దండధరుని గాను, ధర శతమన్యు, ది
క్పాలుఁడౌ కుబేరు గాను, శూలి
గాను, చేసి నరున కీ నాల్గు పదవుల
నేక కాలమందు నిచ్చు జరయె ! 59

ఆ. స్మృతియు శ్రుతియు మిగుల శిథిలములై పోయె
ద్విజ సమూహ మయ్యె విగళితమ్ము
కర్మ, గో సమూహకము శిథిలం బయ్యె
జర, కలియుగమునకు సామ్య మయ్యె. 60

ఆ. అంతలోనఁ జెఱుపు నంతలో మఱుపును
అంతలోన మోహ మందు వృద్ధ
చేటు నొందు దీప శిఖ వోలె ముదుసలి
మదికిఁ జెఱుపు మఱుపుఁ దుదిని గలుగు. 61

ఆ. కనిన వస్తువెల్ల కావలె నను నాశ
కొనిన దానినెల్ల తినఁగ నాశ
కన్నవారి నెల్ల కసరుట ముదిమిని
శ్వాస, కాస, లీసు, నాస, ప్రబలు. 62

ధ న ల క్ష్మి

ఆ. రాఁ దలంచె నేని లక్ష్మి తా వచ్చును
నారికేళ మందు నీర మట్లు
పో దలంచె నేని పోవును ధనలక్ష్మి
ద్విరద భుక్త మగు కపిత్థ మట్లు! 63

ఆ. ధనము ననుభవించి ధర్మమ్ము చేయుము,
మాన్యులకు ధనమును దాన మొసఁగు
చంచల మగు లక్ష్మి క్షణములోన నశించు
గాలి లోని దీప కళిక వోలె! 64

ఆ. విషము విషము కాదు విత్తమే విష మగుఁ
బ్రజ లనెదరు దీని వ్యత్యయముఁగ
విషముఁ ద్రావి శివుఁడు వేయేండ్లు వర్ధిల్లె
మురహారి సిరి నంటి ముగ్ధుఁ డయ్యె! 65

ఆ. ఇందిర తన పద్మ మందిర మందేని
సంధ్య వచ్చు దనుకఁ జక్క నిలుచు
అన్య నింట నద్ది యచల యై యుండునా?
తిరుగ మరుగు కాలు స్థిరత గనునె! 66

ఆ. గుణి యగు సుజనుండుఁ గోచరింపఁగ లక్ష్మి
తాను భయము నందుఁ, దన్ను నతఁడు
భవ్య గుణ గణమున బంధించు నని, భీత
హరిణి వోలె లక్ష్మి పరుగు లిడును. 67

ఆ. "విధవ నగుదు" ననుచు వీరుల విడుచు ను,
దార జనుల లజ్జ నోరసించు!
సత్కవులను వీడు సాపత్న్య భీతిచే!
గృపణుల కడకేగు చపల లక్ష్మి. 68

ఆ. ఆల మంద లందు నాడె కృష్ణుం డని
గో సమానులైన కుజన వితతి
తోడ గూడి లక్ష్మి యాడుచుండును నేడు
నా సతీత్వ మెన్న హరుని తరమె ! 69

ఆ. సింధు పుత్రి! లక్ష్మి! చెలిమికత్తియ! నీదు
సుగుణ గణము నెట్లు పొగడనేర్తు?
జడుల యందు నీకుఁ గడు ననురాగ మౌ
రసికులందుఁ గడు వి రక్తి యహహా! 70

ఆ. "అంధు లౌదు రంట సింధుపుత్రిని గొల్చు
వారు" నైచు లక్ష్మి! పరుష వాక్కు-
అటులఁ గాకయున్న హరి విశాలాక్షుండు
భుజగ మందు నిద్ర వోవు నెట్లు? 71

ఆ. భువన మందు ధనమె మూల మౌటను మిత్రి!
ధనము సంగ్రహించు ధర్మమునను
ధన విహీనునకును ధరణిని మృతునకుఁ
దారతమ్య మేమి దూర దర్శి? 72

ఆ. భువి విమోహక మగు యువతీ స్వరూపమ్ము,
యువకుఁడౌ పురుషున కొక్క క్షణము,
ఆ హిరణ్య మెపుడు మోహక మగు యోగి,
బాల, వృద్ధ, షండ వనితలకును! 73

ఆ. నరుఁడు భటుఁడు కాఁడు నరపతి కెన్నఁడుస్
ధనమునకె యతండు దాసుఁ డగును!
ధనము కలుగ గురుత ధన ముడుగ లఘుత
ఆలకించు సత్య నార్యసూక్తిఁ. 74

ఆ. కనుము మద్దెల ధన ధన ధన మనుచు, చై
తన్య హీన మయ్యు ధనముఁ గోరు
జనుఁడు ధనము నెఱిఁగి చైతన్య యుతుఁడయ్యు
ధనము వీడి యెటుల మనును దాను! 75

ఆ. ధనము కలుగువాఁడె ధర కులీనుం డగు
నతఁడె పండితుండు, నతడె సుగుణి,
అతఁడె దర్శనీయుఁ, డతఁడె వాగ్మియు, సర్వ
గుణ గణములు ధనముఁ గొలుచు చుండు. 76

ఆ. ఆఁకొని తినఁడెవఁడు వ్యాకరణముఁ, గావ్య
రసముఁ దప్పిఁ గొనుచుఁ ద్రాగ బోఁడు
ఇలను ఛందములును గుల ముద్ధరించునా?
ధనము లేక సర్వమును హుళక్కి! 77

ఆ. ఉన్నవాఁడును ధన మున్నవాని కొసంగు
లేనివాఁడు నున్నవాని కొసఁగు
పల్లపు జలముండు పల్లముననె, మిఱ్ఱు
నీరుఁ బల్లమునకె చేరు నహహా! 78

ఆ. వె. గాత్రమందు చెమట గతి యందు (గంపమ్ము
స్వరము నందు హీన భావ ముండు
మనసు నందు భయము కన నగు నీ నాల్గు
మరణ ముపస్థి నరుల యందు. 79

ఆ. వె. (దేహి, యను పిడి విని ధీ శ్రీలు, హ్రీ, కీర్తి
ధృతు లనియెడు పంచ దేవతలును
ముఖము నుండి బాహ్య మున కేగి దేహమున్
విడిచి చేరుకొం(దు విష్ణు పదము. 80

ఆ. వె. వచన బిలము నుండి ప్రాణము ల్వెడలును
అర్థి(, దేహి, యనెడి ప్రార్థనము తో
"త ద్దదామి" యనెడి దాతృ వాక్యము విని
శ్రోత్ర మం దసువులు చొచ్చు మఱల. 81

ఆ. వె. దేహి, యన(గ( దల(చు దేహి తా దుఃఖమ్ము
దాత యెఱి(గె నేసి తనుపు( గోసి
తనదు మాంస మైన దానమ్ము చేయుడా!
తనువు నొస(గ నుండ ధన మ దెంత? 82

ఆ. వె. ఆశ ముందు కాయమును ప్రేరణ చేయు
లజ్జ వెనుక కెదను లా(గి పట్టు
లజ్జ కాశకు నడి లగ్నమౌ తన మన
మూ(గు చుండు డోల యూగు నట్లు. 83

ఆ. వె. ఒకని కరము మీద నొకని హస్తము క్రింద
దాతృ యాచక కర తలము లుండి
వారి యుచ్చ నీచ తారతమ్యము నవి
సూచితమ్ము చేయుచుండు గనుడి! 84

ఆ. వె. యాచ్ఞ కఠిన మౌనొ! హాలాహలముఁ ద్రావ
కఠిన మగునొ తెలుపు గరళ కంఠ!
నీ రసజ్ఞ యొకటె యీ రెంటి భేదమ్ము
నెఱుఁగుఁ గాన, కష్ట మేది తెలుపు! 85

ఆ. వె. ఎంత వఱకుఁ బరుల నెవఁడేది యాచింప
కుండు, నంత వఱకె యుండు మహిమ
బలిని యాచ్ఞ చేసి వామనత్వము నొందె
విశ్వరూపుఁ డయ్యు విష్ణు వహహా! 86

ఆ. వె. హృదయ మందు లజ్జ యుదర మందున వహ్ని
యుండ, నగ్ని కాల్చె నురఁపు లజ్జ
నే నయితిని దాన నిర్లజ్జుఁ డను, రాజ!
సిగ్గు లేక మఱల ఁజేరి నాడ! 87

ఆ. వె. గజము చెవుల తోడఁ గడకుఁ గొట్టిన నళి
కరి కపోలము నరిగాపు ఁగాయు
దానముఁ గొను నర్థి తా నంధుఁడై, యవ
మానముల సహించు మానసమున. 88

ఆ. వె. కట్టఁగ నెరవిచ్చిపట్టు చీర నొకర్తు
పీటఁ బట్టు కొనుచు వెంటఁ దిరిగె
తన తలుపులు తీసి తన వారి కెర విచ్చి
కుక్కల నిశిఁ గాచుకొనె నొకండు. 89

ఆ. వె. తనదు దీప మంచుఁ దాను ముద్దిడుకొన్న
కాల్ప కున్నె తనదు గడ్డ మెల్ల ?
తనదు సర్ప మంచుఁ దాను ముద్దిడుకొన్న
కఱవ కున్నె తనదు గండ తలము ? 90

ఆ. వె. విష్ణువున కరుదు ని వేదన, పూజారి
యారగింపఁగఁ బులి హోర కేడ్చె !
మూల విగ్రహములు మూల మూల్గుచు నుండ
ఉత్స విగ్రహమున కుత్సవంబ ? 91

ఆ. వె. మందు పేరు చెప్ప మన జబ్బు కుదురునా ?
తిమిర ముగుడునె, దివె, దీప మనఁగ ?
"ఎఱుక, యెఱుక" యనఁగ ధరముక్తి దొరకునా?
కార్య మవసరమ్ము వీర్య మేల ? 92

ఆ. వె. విత్తముఁ గొనువేళ నుత్తమర్ణుని యింట
హోళికోత్సవమ్ము కేళి సలుపు ,
అప్పుఁ దీర్చు వేళ నధమర్ణు నింట పెన్
దీపి కోత్సవమ్ము రూపు నొందు ! 93

ఆ. వె. కూడు గుడ్డలు నను గోరకుండిన, దూత !
కన్న బిడ్డ వోలె గాంతు నిన్ను !
పనియుఁ బాటు లేక పండ నిచ్చిన, దొర
సాని ! సేవఁ జేతు బానిస వలె ! 94

ఆ. వె. నిప్పు ముట్టకున్న నీ చేయి కాలునా ?
ఉల్లి ముట్టకున్న నున్నె కంపు ?
పడ్డ కుడువకున్న పాలిచ్చునే గోవు ?
పతిని గలయక సతి పాపఁ గనునె ? 95

ఆ. వె. చవిటి నేల మీదఁ జల్లిన బీజముల్.
శవము కొఱకుఁ జేయు జాగరమ్ము,
పంది నిద్ర బోవు వానికిఁ గై మోడ్పు,
మూఢ మతికిఁ జేయు బోధ వృథయ. 96

ఆ. వె. అర్థముఁ దన ప్రాణ మాచార్య వశ మైన
తాళమును, తనువును, దన వశంబె !
చేనును గొడవలియు జీతగాని వశంబు
చేని పైరు సేద్యగాని వశమె ! 97

ఆ. వె. మగని మీది కోప మదమున నే యమ
బిడ్డ మేన వాతఁ బెట్టు నొక్కొ ?
ఎలుక మీద నున్న యీసునఁ దన యింటి
కిడునె మూర్ఖుఁ డేని యింగిలమును ? 98

ఆ. వె. కులము చెడిన వెనుక కులటకు మతి వచ్చు!
వంట కాఁగఁ బోయి పంట మండు!
ధన ముడిగిన వెనుక దాన గుణము కల్గు!
వయసు మీర తీర్థ వాంఛ కలుగు! 99

ఆ. వె. మజ్జిగ కని వచ్చి మఱుఁగున పెట్టుచుఁ బాత్ర,
పాడి బఱ్ఱె బేర మాడు మూర్ఖు
హూటకూళ్ళ కేగి పుట్ల ధర నడుగు,
కూలి కేగి పొలముఁ బాలి కడుగు! 100

ఆ. వె. ఒక్క కాసు గొడ్డు కొక రూక బందె, యే
గాని ముండ కొక్క కాని క్షౌర,
మర గడియ సుఖమున కార్నెల లగు రోగ,
మురవు చద్ది కంటె నూరుఁగాయ. 101

ఆ. వె. ఎలమి కోడి గ్రుడ్ల కీఁకలఁ దీయంగఁ
గాకి నోట దంత గణనఁ జేయ,
స్తన యుగళము నందు శల్య శోధనఁ జేయ
శంకలు కలుగు నతి శంకితునకు! 102

ఆ. వె. తాను దిండి లేక దారిద్ర్యమునను, ఁద
మాపు, లే దన మఱి మానె డనుట;
నీదు పేరఁటమ్మ నే నొల్లనన, వేలు
వల్లె కట్టుకొనియె వత్తు ననుటె! 103

ఆ. వె. ముద్దున కని పిల్లి మొలకు రొయ్యలు కట్ట
ఆవల కరిగి యది యారగించె !
పాడు గుణములు కల బావ కక్షత లీయ
నోట వేసికొనియెఁ జాటు కేగి. 104

ఆ. వె. పాప మనుచు దాత పాఁత బట్ట నొసంగ
గోడ చాటున నది కొలిచె లోభి,
ధర్మమునకు దాత ధాన్యము నొసఁగఁ దాఁ
బిచ్చ కుంచ మనుచుఁ బెట్టెఁ దగవు! 105

ఆ. వె. కొండ యంత మగఁడె కూలి పోవఁగ ముగ్ధ
అర పిడికెడు జుట్టు కొఱకు నేడ్చె!
కుండ యంతటి తల ఁగోయ నుండఁగ ఁజెవి
పోఁగుల కయి జడుఁడు పొక్కి యేడ్చె! 106

ఆ. వె. తనదు కుక్క యనుచుఁ దాను ముద్దిడుకొన్న
మూతినిఁ దెగ నాకు మోదమునను
తనదు ఖడ్గ మనుచు ధార నాస్వాదింపఁ
దనదు జిహ్వ నద్ది తునుమ కున్నె ? 107

ఆ. వె. దాది, మంత్రసాని తనము కొప్పుకొనంగ
బిడ్డఁ బట్టవలయు విష నేని !
నటుఁడు శునక వేష నటన కొప్పుకొనంగ
"భోభో", యనుచుఁ దాను మొఱుఁగవలయు. 108

ఆ. వె. "మ్రొక్కుబడియె లేదు పొమ్మ దాసరి!" యన
"బిచ్చ మొకని కేని పెట్టు" మనుట;
"ఇల్లు వీడు నంబి! యిట నుండ రా" దన్న
"నాదు మాన్య మిమ్మ పోదు" సనుచె! 109

ఆ. వె. తాము చదివెడి దది రామాయణమె గాని
కూల ద్రోయును మగ ఱాల గుళ్లు!
చేయునట్టి వెల్ల శివపూజలే గాని
చెప్పు నట్టి వెల్ల తప్పు నుడులు! 110

ఆ. వె. కూరుచున్న కొమ్మఁ గొట్టంగ నెంచుట,
వీధి నిప్ప లొడిని వేసి కొనుట,
తనదు డబ్బు నిచ్చి తద్దినమును గొంట,
కొఱవి తోడఁ గొప్పు గోఁకి కొనుటె! 111

ఆ. వె. కాకములను గొట్టి గ్రద్దల కెర వేఁత
కాల్చి బొగ్గు సేత కల్పకమును
కాలిచి పరికుప్ప పేలాలు వేచుట,
ఆవుఁ జంపి చెప్పు లీవి సమము, 112

ఆ. వె. చెప్పు చిన్నదనుచు ఛేదింతువా కాలు?
తండ్రి వృద్ధుఁ డనుచుఁ దఱుము దొక్కొ?
త్రాఁడు చిన్నదనుచుఁ బూడిచెదవొ, నూయి?
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 113

ఆ, వె, ఏడ్పుతో నుగాది నేరువాకను జేయ
దొంగ, కాడి మోకు దొంగిలించె
ఇష్టపడని పనినిఁ గష్టముతోఁ జేయ
మొదటి నుండి ముప్పు మోసు దనుక. 114

ఆ. వె. నెమలి కంటినుండి నీరు కాఱిన వేఁట
కాని కేల కలుగుఁ గనికరమ్ము ?
గొఱ్ఱె యఱపును విని కోపించు వృకమున
కేల కలుగుఁ జెప్పు లాలనమ్ము ? 115

ఆ. వె. దేవుఁ డొసఁగ వరము దిగఁ దీయుఁ బూజారి
దాత ధనము నొసఁగ దూత విసుగు
పండ్ల నొసఁగ మ్రాను ముండ్లు వేయును రైతు
బలి ధర నొసఁగఁ గవి వటున కట్లు ! 116

ఆ. వె. కుక్క తోఁక నమ్మి గోదావ రీదకు
మేటి బొజ్జ నమ్మి యేటఁ బడకు,
ఖలుని మాట నమ్మి కనక మప్పొసఁగకు,
మాలకించు "సత్యనార్య" సూక్తి. 117

ఆ. వె. ధర్మమునకుఁ గొలువ ధాన్య మేదుమొకండు
పిచ్చ కుంచ మనుచుఁ బెట్టెఁ దగవు,
పడఁతి ఫలము లొసఁగఁ బళ్లెరమునఁ బెట్టి
పళ్ళె మొసఁగు మనుచుఁ బట్టు పట్టె ! 118



# తెలుఁగు సామెతలు



ఆ. వె. వయసు మీఱి చేయు వైవాహికమ్మును,
వేళఁ దప్పి చేయు విందు కడుపు,
తల్లి లేని పిల్ల, ఉల్లి వేయని కూర
పప్పు లేని బువ్వ, మెప్పుఁ గనునె ? 119

ఆ. మన సెఱుంగని కల మహి నుండగాఁ బోదు!
ఒడ లెఱుఁగని శివ ముండఁ బోదు !
తన మన స్సెఱుఁగని తప్పుండగాఁ బోదు
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 120

ఆ. అన్న మొక్క పూఁటఁ దిన్నవాఁ డగు యోగి;
రెండు పూఁటలఁ దిను వాఁడు భోగి;
మూఁడు పూఁటలఁ దినువాఁ డెన్నటికి రోగి,
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 121

ఆ. వేఁడి నీళ్ళ కొఱకు వెడలుము వెనుకగా,
వెట్టి మూట మోయ వెడలు ముందు,
స్నానమునకు వెడలు జాగు చేసియె, ప్రియ
భోజనమును జేయుఁ బొమ్ము ముందు. 122

ఆ. గుద్దు లాడు నింట గుప్పెడు ధాన్యఁపు
గింజ యుండవు పులి గంజి కఱవు
కలహ మాడు నింటఁ గట్టు బట్టలు లేక
గోఁచి గుడ్డ కేని కొఱఁత కలుగు ! 123

ఆ. వె. వ్రతము చెడిన నేమి ఫలము దక్కినఁ జాలు
కూడు దొరకిన సరి కులము చెడిన!
పొలఁతి సిగ్గుడిగిన బొజ్జ వచ్చినఁ జాలు
నాలకించు "సత్యనార్య" సూక్తి. 124

ఆ. "ఊరు చేరఁ బోకు రా, రౌత!" యన, "నాదు
గుఱ్ఱము నెటఁ గట్టుకొందు" ననుట,
"వెంట రాకు బిడ్డ! వెడలు వెన్కక" టన్న
"నెత్తు కొమ్మ"ని శిశు వేడ్చి నట్లు! 125

ఆ. "త్రాగ మజ్జి గేని తనకు లే"దన "చీటి
వ్రాయుము పెరుఁగు నకు బావ!" యనుట
"టక్కు లేల! యల్లుఁడ వె కావు పొమ్మ"న
"భార్య నంపు" మనుచుఁ బలికి నట్లు! 126

ఆ. కాకి ముక్కు నందుఁ గను దొండ పండును,
మొండి ముక్కు నందు ముక్కఱ వలె
మైల పాఁత లోన మణిని గట్టిన రీతి
నాలకించు "సత్యనార్య" సూక్తి. 127

ఆ. వచ్చి నట్టి వాదు చచ్చిన నది పోదు
బ్రహ్మ కేని పేద వాని కేని!
పుట్టు మచ్చ మేనఁ బుట్టినఁ బోవునా
బ్రిహ్మ కేని బీద వాని కేని? 128

ఆ. వె. తల్లి గుణము నెఱిఁగి పిల్లను గైకొను
పాలు చూచి పాడి బఱ్ఱెఁ గొనుము,
వంశ మెఱిఁగి కొనుము వనితను బెండ్లాడ,
వన్నె నెఱిఁగి కొనుము దున్న పశువు. 129

ఆ. ఏడ్వఁ జెప్పు వాఁడె యిల బ్రతుకఁగ జెప్పు
నవ్వఁ జెప్పు వాఁడు నష్ట పఱచు
ఒప్పుఁ జెప్పు వార లోరు లగుదురు, మన
తప్పుఁ జెప్పు వారు తగిన హితులు. 130

ఆ. ములుగఁగ ములుగంగ ముదురును రోగమ్ము
కవిలె వ్రాయ వ్రాయఁ గరణ మగును
దగ్గు దగ్గఁ గాను దాతకు మరణ మౌ
వేఁగ ఁదీయఁ దీయ రాగ మబ్బు. 131

ఆ. గుండు ఱాయి దాఁచఁ గూఁతురు పెండిలి
కాక యాగిపోవ గలుగు నొక్కొ ?
పగతులు పగఁ బూని పంచాంగమును దాఁచఁ
దారకా గణమును దాఁగు నొక్కొ ? 432

ఆ. పూఁట కూళ్ళ దాని మాట తల్లిని బోలు
దాని పెట్టు మాలు తల్లిఁ బోలు !
మాట చూడ ఘనము మానిక పిచ్చ దౌ
పూఁట కూళ్ల దెఱుఁగు నోటు నీతి ? 133

ఆ. వె. ఊరి నిండ నున్న వారలు చుట్టాలె !
ఉట్టిఁ గట్టు కొఁనఁగ బట్టు లేదు
తిండి పోతు లింట నుండిరి పది మంది
వంట పనులు చేయఁ గంటఁ బడరు ! 134

ఆ. తలకు మించి నట్టి బలగము కలిగియుఁ
దలకుఁ జమురు పెట్టు వెలఁది లేదు
ఇంటిని వెలుపంగ నిలువది కోళ్లున్న
"కొక్కురో" యని కూయు కోడి లేదు ! 135

ఆ. తప్పు నొప్పును, పర దైవం బెఱుంగును
పప్పు కూడు లెఱుఁగు బ్రాహ్మణుండు
తన తనయుని పుట్టువును దల్లి యెఱుఁగును
ఎడఁద లోని మాట నీశు డెఱుఁగు. 136

ఆ. క్షీరములను చెఱుప చిఱు పులపయె చాలు
చేట పెయ్య పనులఁ జెఱుప జాలు
దూదిఁ గాల్ప నిప్పు తునకయె చాలురా
సాధు జనులఁ జెఱుపఁ జాలు ఖలుఁడు ! 137

ఆ. ఉత్త పడతి యింట నుత్తఁగఁ దిని పండు
నత్త యయిన పనుల నరసి చేయు
ఉత్త ముండ కన్న నత్తముండయె మేలు !
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 138

ఆ. వె. కాలు జాఱె నేని నేలను బడకుండ
కాలు తీసికొనఁగఁ గలఁడు నరుఁడు
నోరు జాఱె నేని నూ ఱుపాయములతో
మాటఁ దీసికొనఁగ మనుజు వశమె, 139

ఆ. సత్ర మందు బువ్వ సాపాటు చేయ, స
ర్కారు, శెలవు కలదె "రండ" నంగ !
అడవి లోన నక్క లఱచుట కచట "కొ
త్వాలు నాజ్ఞ కలదె "వలద" నంగ ! 140

ఆ. కన్నెఱుఁగక యున్నఁ గడు పెఱుఁగదె, యన్న
మెంత తన కడుపున నిముడఁ గలదొ ?
తల్లి యెఱుఁగ కున్నఁ దనయుం డెఱుంగడా ?
తాను పాల నెపుడు త్రాగ వలెనొ ? 141

ఆ. సిరులు పోయె నేని చిన్నెలు పోవునా ?
చింత చచ్చె నేని చెడునె పులుపు ?
అర్థ ముడిగె నేని యలవాట్లు తప్పునా ?
కులము మాఱె నేని గుణము చెడునె ? 142

ఆ. గాజుల గుదిఁ గొట్ట గాండీవ మేలరా ?
బడుగు పిచుకఁ గొట్ట వజ్రి మేల ?
కోడి గ్రుడ్డు గొట్ట గుండ్రాయి యేలరా ?
కుక్కఁ గొట్ట గండ్ర గొడ్డ లేల ? 143

ఆ. వె. శంఖ మూదు వాఁడు జంగము దేవర,
తానె తప్పెటఁ గొట్ట దాసరి యగు
"సువ్వి" యనఁగ నదియె సుమ్ము దంపుడు పాఁ
తిమ్మఁ డనఁగఁ గోఁతి సుమ్మెఱుంగు. 14

ఆ. "కూఁతుర ! కాను" మంచుఁ గుంచె డిచ్చిన నోరు
"తల్లి ! యన్న" మనుచుఁ దళియె ద్రొసఁగు,
"చెలియ ! బత్తెకిదిగొ చిట్టు పరక" యనంగ
"పడఁతి పాలను గొను పాప" కనును ! 145

ఆ. ఇల్లు కట్టు వాని కేడాది పట్టును !
కాల్చు వాని కొక్క క్షణము పట్టు !
కుమ్మరి కొక యేడు కుండ వానఁగఁ బట్టు !
గుదియ కొక్క క్షణము కొట్టఁ బట్టు ! 146

ఆ. కూటి కొసఁగ లేక వేఁటాడు వాని వి
ల్లోపటు వలన కలుగు నేటి ఫలము ?
క్షుత్తు నుడుపలేని క్షుద్ర విద్యల యల
వాటు వలన నేమి ఫలము కలుగు ? 147

ఆ. కుక్క నింటఁ బెట్టి కొట్టిన నది, కడు
భయమున గృహ మెల్ల పాడు చేయు
పిల్లి నింటఁ బెట్టి బెదిరింప మన కనుల్
తప్పక పెఱుకు నది తప్పు కొనఁగ ! 148

ఆ. వె. ఊరి కందటికివి నొకతెయె వెలయాలు
ఆమె యెవని యింట నాడుఁ బాడు?
ఊరి లోన నున్న వారంద ఱల్లుండ్రె!
ఒక్క తనయ యెవని ప్రక్కఁ జేరు? 149

ఆ. మాను పిల్లి గాని మట్టి పిల్లియె గాని
ఎద్ది యెలుకఁ బట్టు నద్ది పిల్లి!
మందు ముద్ద గాని మంటి ముద్దయె గాని
యెద్ది రోగ ముడుపు నద్ది మందు! 150

ఆ. కాటి లోనఁ బండె! కాకులు తిని పోయె,
కష్ట మేమి తనకు నష్ట మేమి?
లంచము నసె వచ్చె రచ్చ లోన నశించె
కష్ట మేమి తనకు నష్ట మేమి? 151

ఆ. చావఁగా మిగిలిన జనుఁ డింటి కగుఁ బెద్ద
పోవ మిగులు వాఁడె పురికిఁ బెద్ద
చచ్చు వాఁడగును శ్మశానమునకుఁ బెద్ద
ఊరి కగును పెద్ద యున్న వాఁడె! 152

ఆ. "అంబ టేఱు వచ్చె నత్తా!" యనఁగఁ "జూడు
కోడల! యిదె చేత ఁగోలత బుఱ్ఱ!"
ఏఱు వచ్చి యూరఁ బాఱు చుండిన నేమి!
కట్టి కుక్క నోట గతుకు నీళ్ళె! 153

ఆ. వె. అచ్చి రాని రూప మది కోఁతి రూపమ్మొ
అచ్చి వచ్చిన నది హనుమ రూపు !
అచ్చి రాని మూల ఆపదలకు మూల
మచ్చి వచ్చిన ధన మిచ్చు మూల ! 154

ఆ. కనులు పోవు నంత కలుగును సూర్య న
మస్కృతు లను జేయ మహిత భక్తి !
కాళ్లు వాచు నంత ఁగలుగును దీర్ఘాట
నమును జేయు వాంఛ నరున కహహా ! 155

ఆ. అల్లుఁ డెట్టిఁ డైన నర్చింప నర్హుఁడౌ
మనుజుఁ డెట్టిఁ డైన మహిమ కేమి ?
మూర్తి చిన్నదైనఁ గీర్తి మిన్నయె, నర్మ
దా శిలార్చన భవ తాపహరము ! 156

ఆ. కలిసి వచ్చు నట్టి కాలంపు మహిమచే
గాళ్ళ నడచు బిడ్డ కలుగు నంత !
పట్టు నట్టి దెల్ల బంగార మగు చుండు
వేము తిన్న నదియు బెల్ల మగును ; 157

ఆ. అన్నిఁ దెలియు వార లవని నెవ్వరు కల?
రేమియుఁ దెలియకయె యెవ్వ రుండు?
కొంచె మెఱుఁగు వాఁడె కించిద్జ్ఞుఁ డనఁబడు
సర్వ మెఱుఁగు వాఁడు శర్వుఁ డొకఁడె. 158

ఆ. వె. క్రొత్త కోడలు తన యత్త చేతను బడి
ఎత్తిపోటులఁ గడు మెత్తఁ బడును !
మేలు పసిఁడియుఁ గమసాలి చేతను బడి
సుత్తిపోటులఁ గడు మొత్త బడును ! 159

ఆ. వె. కొండయె తల క్రింద నుండ తాళ్ళకు లోటా !
చేత నుండ వెన్న నేతి కేమి ?
ధాన్య ముండఁ జేతఁ దండులముల కేమి ?
పైఁడి చేత నున్నఁ బైస, కేమి ? 160

కం. ఇల నాఁకలి రుచి నెఱుఁగునె ?
వల పెఱుఁగునె వావి, వరుస, పరులను, లజ్జన్ ?
బలు నిద్రి సుఖము నెఱుఁగునె ?
కల బంధుల, గురుల, నెఱుఁగ గలవె ధనాశల్ ?

ఆ. వె. ఉరుము నట్టి మేఘ ముదకము వర్షింప
దఱచు నట్టి కుక్క కఱవఁ బోదు
చెప్పు నట్టి వాఁడు చేయఁ జాలఁడు పను
లాలకించు "సత్యనార్య" సూక్తి. 162

ఆ. వె. బ్రాహ్మణు నకు లేదు రణము నందునఁ బోటు
కప్పకుఁ దన పంటి కాటు లేదు
కోడలి కెట నైన గ్రొత్తఁ దనము లేదు
ఎన్నడుఁ గలబంద కెండు లేదు ! 163

ఆ. వె. ఆళ్ళ వంక మనల కగుఁ దిరుగలి చుట్ట,
మప్పు వంక చుట్ట మగును బావ,
పెట్టు వంక పెఱలు చుట్టము లఁట, మాత,
పితయుఁ జుట్టము లఁట పేఁగు వంక. 164

ఆ. వె. ఆర్తి దుఃఖ ముండు నాఱు నెలలు, కన్న
కడుపు దుఃఖము కల కాల ముండు,
ఎఱుఁగు నార్తి ననుభవించు వాఁడే, కన్న
కడుపు దుఃఖ మెఱుఁగుఁ గన్న తల్లి. 165

ఆ. వె. హాస్య మాడు నట్టి యతివను నమ్మకు
నరుని నేడ్చు వాని నమ్మఁ బోకు,
విశ్వసింప కెట్టి బేస్త వానిని, కడు
నల్ల నయిన విప్రు నమ్మఁ బోకు. 166

ఆ. వె. సోముఁ డోషధులకుఁ, జుక్కలకును ఱేఁడు,
కళలు కలిగిన హిమ కాంతి మంతుఁ,
డినునిఁ జేరి కాంతి హీనుఁ డయ్యెను, గానఁ
జెడియుఁ బరుల పంచఁ జేరఁ బోకు ! 167

ఆ. వె. చినుకులు పడునంత చెఱువులు నిండునా ?
ఊట మ్రింగ దప్పి యుడుగు నొక్కొ ?
ఊపిరి బిగ పెట్ట నుదరమ్ము పెరుగునా ?
బొచ్చు కాల్చు నంత బొగ్గు లగునె ? 168

ఆ. వె. ఇల్లు టంపు టల్లు డింటి కెల్లను జేటు,
ఏడ్చు బిడ్డ సంక కెక్కఁ జేటు,
కొమ్ము లున్న బఱ్ఱె కొట్టమ్ము నకు జేటు!
ముసలి మగఁడు ప్రాణమునకుఁ జేటు! 169

ఆ. వె. అల్ప బుద్ధి వాని కధికార మబ్బిన
మొదటి చెడు గుణములు పోవు నొక్కొ!
కుక్క నందలమునఁ గూర్చుండఁ బెట్ట, న
మేధ్యముఁ గని భూమి మీది కుఱుకు. 170

ఆ. వె. అల్ప బుద్ధి వాని కైశ్వర్య మబ్బిన
గొడుగుఁబట్టు మనును నడికి జేయి
ఎన్నఁ డెఱుఁగ నట్టి చిన్న రెడ్డికి గుఱ్ఱ
మబ్బ వెనుక ముందు లాయె మొగము. 171

ఆ. వె. ఒక్క ప్రొద్దు మాట కుక్క యే మెఱుఁగును?
అటుకుల రుచి యెద్దు కెటులఁ దెలియు?
ఖరమున కెటు తెలియు గంధంపు వాసన?
గొడ్డు దేమి యెఱుఁగు బిడ్డ ప్రేమ? 172

ఆ. వె. తలుపులు దిగ మ్రింగఁ గలిగిన బావ; యై
దప్పడముల మ్రింగు టబ్బురమ్మె?
గుడిని మ్రింగు వాఁడు గుడి లోని లింగమ్ము
మ్రింగఁ గలుగుటయును మిక్కుటమ్మె? 173

ఆ. వె. పుంజ మిడిన బట్ట భువిని మన్నిక నుండు
లంచ మిడిన మాట రచ్చ గెలుచు
ఎద పయి నిడు వాఁత యది చెఱగక యుండు
మన యెదుటను బలుకు మాట నిజము; 174

ఆ. వె. అన్న మిడిన కొలఁది యఱిగి పోవును, పట్టు
చీరఁ బెట్ట నదియుఁ జినిఁగి పోవు
వాఁతఁ బెట్టె నేని వానితోఁ గల కాల
ముండుఁ దనకు దాన దండు గేమి? 175

ఆ. వె. పుడమిని యెరణమ్మ మోదిన పసి పాప
బ్రతికి బట్ట కట్టి బాగు పడునె?
అయ్యొ వాఁత పెట్ట నా బిడ్డ బ్రతుకునా?
ఆలకిఁచు "సత్యనార్య" సూక్తి. 176

ఆ. వె. భువినిఁ బిల్లి కనులు పోఁగోరు చుండును,
కుక్క శిశువులఁ గనఁ గోరుచుండు
అప్పు నిచ్చిన యతఁ డాశించు బాగును
చెడుగుఁ గోరు నప్పు చేయు వాఁడు. 177

ఆ. వె. అయ్య వారిఁ జేయ నది వానరం బాయె
పోలిక నిరువురును బోలి యుంట
విష్ణు పతిని జేయ వింత వానర మయ్యె!
తొండ ముడిచి వెనుకఁ దోఁకఁ బెట్ట. 178

ఆ. వె. ఊరిని విడిచి పౌరు గూరి కేగిన నేని
పూనిన తన కర్మ మానఁ బోధు
కూప మందు గాని గోదావరిని గాని
శేరు కుండ కొనును శేరు నీరు. 179

ఆ. వె. చింత కాయ పడునె క్షితిసి మంత్రములకు ?
అశిషమునఁ బుట్ట నగునె బిడ్డ ?
భువిని బిల్లి శాపమున కుట్లు తెగు నొక్కొ ?
వేఁడి నీటి కిల్లు వెలుగు నొక్కొ ? 180

ఆ. వె. విత్తము కొలఁది తన విభవమ్ము పెఱుగును,
విద్య కొలది పెఱుగు వినయ గుణము;
సిరి కొలది పెఱుగును జిన్నెలు వన్నెలు,
పిండి కొలది రొట్టె పెఱిగి కుట్లు. 181

ఆ. వె. అవ్వ తీయు గంధ మెవ్వనికిని గాక
తలకు పట్టు వేయఁ దాతకు సరి
అవ్వ వడుకు నూలు దువ్వాలువకుఁ గాక
తాత మొలకుఁ గట్టు త్రాఁటికి సరి ! 182

ఆ. వె. కుక్క పిల్లఁ బెంచ కూటి కుండకుఁ జేటు
గుస గుసలు చెలఁగిన గుడికిఁ జేటు
పరుల కిడిన గాజు పైకమ్మునకుఁ జేటు
బ్రాహ్మణ కృషి చేటు బత్తెమునకు. 183

ఆ. వె. జగతి లోభి వానిఁ జంపంగ దలతువా
కొట్టవలదు వానిఁ దిట్ట వలదు
ధనము నడుగు నంతఁ దానె జచ్చును, వాని
ధనమునకును బ్రాణమునకు లంకె ! 184

ఆ. వె. అల్లుఁ డలిగె నేని "పిల్లను బంపు మా
మామ" యనుచు నడుగుఁ దామసించి
ఉత్తమర్ణుఁ డలిగి విత్త మిమ్మని తన
సొమ్ము మొత్తమును వసూలు చేయు, 185

ఆ. వె. అత్త కొట్టు కుండ అడుగోటు కుండ యో,
కోడలె యది కొట్టఁ గ్రొత్త కుండ
అత్త చేయు పనుల కారళ్లు లేవఁట !
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 186

ఆ. వె. ఆశ లేని యింట నడుగఁగ భయ మగు
నండ లేని యూర నుండ భయము
పాత్రిక యప్పు వాని వద్ద కేగఁగ భయ
మావు పడ్డ యొద్ద కలుగ భయము. 187

కం. రాగముఁ దీయని వాఁడును
రోగము రానట్టి వాఁడు, లోలాక్షి పయిన్
రాగముఁ జూపని వాఁడును,
ఓగిరమును దినని వాఁడు, నుండునె జగతిన్. 188

ఆ. వె. గణిక యెంత యంద కత్తె యైనను, గుల
పురుషుఁ డామె తోడఁ బొందుఁ గనునె?
జార, భట, నట, విటః చోరుల కుమియంగఁ
దమ్మపడిగ కాదె ధరణి వేశ్య! 189

ఆ. వె. మనుజుఁ డచ్చపు తిరుమణి ధారియే యైనఁ
బుడకఁ దాల్చు నంతఁ బోల్చ వచ్చు
భాషలఁ గఱచిన యుపాధ్యాయుఁడే యైనఁ
గవితఁ జెప్పఁగఁ బస కాన బడదె! 190

కం. ఆరాటఃపుఁ గదురుం గొని
యే రాటము నందుః బెట్టి నేనియు వడిగాఁ
దారాడుచు "బర బర" యని
యూరంతటి సద్దు చేయు చుండును గనుమా. 191

ఆ. వె. ఉఱిమి కురిసె నేని యుత్తర మేఘముల్
కురియుఁ బెద్ద వాన తిరుగు లేక
తఱిమి కఱచె నేని యురగ మెవ్వని నేని
మరణ మొందు నతఁడుః దిరుగు లేక! 192

ఆ. వె. ఎద్దును గొనఁబోకు కొద్దిలో లోభాన
మఱల మఱల దాని మార్చ వలయు
బట్టను గొనఁబోకు బాగా వెచ్చించి
మఱలఁ గొన వలయు ప జినిఁగి పోవ. 193

ఆ. వె. చద్ది లేని పయన, మెద్దు లేనిది కృషి,
పద్దు లేని యప్పు, రద్దు మూడు,
రాడు లేని పెట్టు, త్రాఁడు లేనిది కట్టు,
ఉద్ది యగు నుభయము నుర్వి నివియు. 194

ఆ. వె. కాకి గంగ మునుగ నగునటే రాయంచ ?
కాశి కేగఁ దురక దాస రగునె ?
కుక్క గోవగు నటె గోమతీ నది కేగ ?
నాలకించు "సత్యనార్య" సూక్తి. 195

ఆ. వె. కోడలు నలుపైనఁ గుల మెల్ల నలుపగు
నన్న మొకటి చెడిన నన్ని చెడును
ప్రత్తి మలినమైన వస్త్రమ్ము మలిన మౌ
కారణ గుణముఁ గను గార్య మందు. 196

కం. కుల మెఱిఁగి చుట్టఱికమును,
స్థల మెఱిఁగి నివాస మెపుడుఁ దాఁ జేయవలెన్
బల మెఱిఁగి సంగరమ్మును
తొలకరి నెల నెఱిఁగి చేయు తొలుతనె పైరున్.

ఆ. వె. ఆశ లేక యున్న దేశాటనం బేల ?
శ్వాస లుండు దనుక నాశ లుండు
ప్రేమ లేక యున్నఁ బ్రేయసి యేలరా ?
కాయ ముండు దనుకఁ గాపు ముండు ! 198

ఆ. వె. చెడ్డ కాపురమును జెఱుప ముప్పున్న దే ?
బోడి కాలి కిడఁగ జోడు కలదె ?
గ్రుడ్డి కంటికిఁ గనుఁ గొనఁ జూడ్కి కలదటే ?
వంధ్యకుఁ గుచయుగళిఁ బయసు కలదె ? 199

ఆ. "చక్కిలములఁ దినెదో? చద్దినిఁ దినెదవో ?"
యనుచుఁ దల్లి యడుగఁ దనయుఁ డనియె
"చక్కిలములను దిని, చద్దినిఁ దిని, వేఁడి
వేఁడి బువ్వ నాన్న తోడఁ దిందు !" 200

ఆ. వంట నేర్చిన మగ వానితోఁ బణ మిడి
వాదు నందు గెలుచు వనిత యెవతె ?
చదువు నేర్చిన నెర జాణతోఁ బణ మిడి
వాదు నందు గెలుచు వాఁ డెవండు ? 201

ఆ. నాన్చి నమలుచుండు నరుని కంటెను దిగ
మ్రింగు నట్టి వాఁడె మేలు, దినుసుఁ
గొన్న వాని కంటెఁ దిన్నవాఁ డగు మేలు,
విన్న వాని కంటెఁ గన్న వాఁడు, 202

ఆ. కటిక వానికిఁ దయ; కందికిఁ జెమురును,
గాన రాదు భువిని గాంచి చూడు
కప్ప నోటఁ గాటు కన విప్రునకుఁ బోటు
రణము నందుఁ గాన రాదు చూడు ! 203

ఆ. వె. పుట్టు గ్రుడ్డి కిప్ప పూపు బెల్లం బగుఁ
దల్లి లేని బిడ్డకు దాది తల్లి
గంజి పానక మగు గతి లేని యమ్మకు
నాలకించు "సత్యనార్య" సూక్తి. 204

ఆ. కఱవు వలన జనని కడుపు కాలుచు నుండ
మధ్య వచ్చు నధిక మాస మట్లు,
తిండి లేక యత్త తిరిప మెత్తు కొనంగఁ
గుడువ నల్లుఁడు మనుగుడుపు కేగె! 205

ఆ. "పుచ్చకాయ దొంగ వచ్చెరా" యన ముచ్చు
తన భుజమును దడుము కొనిన యట్లు
"దూది దొంగ" యనఁగ దూదేకు సాహేబు
తనదు గడ్డముఁ దను దడుము కొనియె. 206

ఆ. సఖుఁడ! భక్తితోడ ఫాలచంద్రుని పూజ
సలుపు చుంటి విన్ని శ్రమల కోర్చి!
విఘ్న రాజు మీద విమల భక్తియొ? ఉండ్ర
ముల పయినసె భక్తి కలదొ చెపుమ? 207

ఆ. దాయ భాగ మెల్ల దత్తున కొసఁగుచు
దత్తతఁ గొనుట కయి తలచి తీవు
దత్త పుత్రు మీదఁ దగని వాత్సల్యమో?
పాలి వారి మీద మేలి పగయొ? 208

కం ఒక్కని సంపాదన చనుఁ
బెక్కులు తిని పోవఁ, ధర్మ పృథ్వీశుని-చేఁ
జిక్కిన కరిపురరాజ్యము
పెక్కుగఁ జనె, ధార్తరాష్ట్రి పిండము లిడగన్.

ఆ. వె. ఉన్న ఉతాధికారి కున్న యర్థాఉఒశను
స్వల్ప ధనము తీర్పఁ జాలు నొక్కొ ?
ఏనుఁగునకు దాహమైనఁ బంచనఁ జాలు
చూరి నీరు దానిఁ దీరుచు నొకొ ? 210

ఆ. ఉబుసు పోక యున్న నూరి ముందరఁ బైరు
బెట్టి కయ్యములను బెట్టు కొనుము
ఉండఁ బట్ట కున్న నూరి సంబంధమ్ముఁ
జేసికొనుము నోరు మూసి కొనుము. 211

ఆ. విగతభర్తృక వయి వగవ కుండెద వేల ?
ఇంతి! చెంత నుండు నింతిఁ గనుము !
వగచు నట్టి యింతి మగఁ డేగు డెంచిన
బావ ! నా మగఁడును వచ్చుఁ గాదె ! 212

ఆ. ఎనుఁ గంత తండ్రి యింట నుండుట కంటె
ఏకుఁ బోలు తల్లి సాఁక మేలు,
ఏదుము ముడి ధాన్య మింట నుండుట కంటెఁ
దాను దినఁగ మేలు తవిటి రొట్టె ! 213

ఆ. వె. ఆరగించు నంతఁ దీఱని యాఁకలి
యడిగిన నది తీరనగునె ? దినుసుఁ
గొనినఁ దీరకున్నఁ దన యవసరము తా
గొసరిన నది వూడు కొనఁగ నగునె ! 214

ఆ. ఆవు చేని లోని కరిగి పైరును మేయ
దూడ చేని గట్టు నేఁత మేయు ?
తల్లి చీఁకటి పనిఁ దాఁ జేయఁ దనయ యా
చెడుగు లుడిఁగి యెటు సుశీల యగును ? 215

ఆ. ఎద్దు నెద్దుఁ గూడి యీసునఁ గొట్లాడి
లేఁగ దూడ కాలు పేఁగ విఱచె ;
రాజు లిద్ద ఱలిగి రణ మందుఁ బోట్లాడి
ప్రజల ప్రాణములను బలిగఁ గొనరె ! 216

ఆ. నేతి కుండ తోడఁ నాఁతి సామ్యము నొందు
పురుషుఁ డగ్ని కీలఁ బోలి యుండు
వారి మానసములు తారసిల్ల ద్రవించుఁ
గాఁక తగుల నేయి కఱుగ కున్నె ! 217

ఆ. అన్నదాత "యన్న మధిక మిడు" మ టన్న
వడ్డన కయి జంకు వంట వాఁడు
ఒడయఁ డొసఁగఁ బదవి నుమ్మేఁజువా రడ్డుఁ
'బదవు లొసఁగ వలదు పరుల" కంచు. 218

ఆ. వె. ఆలి వంక వార లాత్మ బంధువులును,
తల్లి వంక వారు తనకు హితులు,
తండ్రి వంక వారు తనకు దాయాదులు,
భక్తి వంక వారు పరమ గురులు. 219

ఆ. అయ్య వచ్చు దనుక నమవస యాగునా?
వైద్యుఁ డరుఁగు దనుక వ్యాధి యేని?
తాత వచ్చు దనుకఁ దద్దిన మాగునా?
బత్తి కలుగు దనుక మిత్తి యేని? 220

ఆ. లోభి సొమ్ము లన్ని లోకుల పాలురా!
దొంగ సొమ్ము లన్ని దొరల పాలు!
లంజ సొమ్ము లన్ని లంచాల పాలురా!
రాజు సొమ్ము లన్ని జూళ్ళ పాలు! 221

ఆ. కులము లోనఁ జిన్న కొమరుఁడై పుట్టినా
మెక్క వచ్చుఁ బంది కొక్కు వలెను
కులము లోనఁ జిన్న కోడలై మెట్టినా?
దాణ, మెక్క వచ్చు రాణి వలెను. 222

ఆ. కులములోనఁ బెద్ద కొమరుఁడై పుట్టినా?
ఇంటి బాధ్యత తన వెంటఁ బడును
కులము లోనఁ బెద్ద కోడలై మెట్టినా?
ఇంటి పెంట పనులు వెంట బడును. 223

ఆ. వె. అధమున కిల లోన నాలియౌ కంటెను
దాసి యగుట మేలు ధనిక తతికి
షండుఁడైన ధనికి సతి యౌట కంటెను
అధను రసికుని సతి యగుట మేలు। 224

ఆ. కడుపు లోన లేక కౌగిలించిన యంత
మాత్రముననె ప్రేమ పాత్రుఁ డగునె?
మదిని భక్తి లేక మంత్రము లని నంత
మాత్రమునె ముక్తి పాత్రుఁ డగునె? 225

ఆ. ఏనుఁగు పడు కొన్న నెత్తు గుఱ్ఱం బంత।
చాఁప చిరిఁగె నేని చదర యంత
పంచె చిరిఁగె నేని పాఁత గోఁచీ యంత
కోక చిరిఁగె నేని ఱైక యంత। 226

ఆ. ముద్దు లొలుకు పిల్ల, ముద్ద బెల్లఁపు పెల్ల,
ప్రోల నున్న ముల్లె మూటఁ జూడఁ
రిమ్మ తెవులు పుట్టు బమ్మదేవర కైన
నూట నీరు నోట నూరు చుండు. 227

ఆ. కడి యిడెద నటన్న వడిఁ దెఱచును నోరు
కళ్ళె మిడెద నన్నఁ ద్రుళ్ళు హాయము
పెట్టు పోఁత లన్న నెట్టి వారికి నాశ
తిట్టి కొట్టు నన్న బిట్టు భయము। 228

ఆ. వె. ప్రజల మధ్య పెట్టి పంచాంగముల లోనఁ
జూపుచు నిపుణతను, సొగసుఁ దసము;
గణికయు గణకుండుఁ గన సామ్యధర్ములై
విత్తహరులు గాను విధి సృజించె. 229

కం. ఒక కలఁ గని నంతట నే
యిఁక గల రాకుండ జేయు యేగతిఁ గడచున్?
ఒక కష్ట మంతరింపఁగ
యిఁకఁ గష్టము రాక మనకి యేగతిఁ గడచున్?

ఆ. వేళఁ బుచ్చ నేల ? బిడ్డకుఁ బాలిచ్చి
నట్లొ! పతికిఁ గాళ్ళు పట్టి నట్లొ ?
జూద మాడు ధనముఁ దాఁ దిని నట్లొక్కొ?
పేద వారి కింత పెట్టి నట్లొ ? 231

ఆ. వండు కొన్న యమ్మ కుండెడి నొక కూర,
అడుగు కొన్న యమ్మ కన్ని యవియె
కట్టుకొన్నవాని కెట్టు నిల్లొ కటియే,
అద్దె కున్న వాని కన్ని యవియె! 232

ఆ. "ఉండు" మనఁగ వద్దు, "పొమ్మ" నఁగను వద్దు
ముంత పొటను బొట్టఁ బోవు వాఁడె !
కొట్ట వలదు వానిఁ, దిట్టంగ వలదురా
పిసికె నేసి పోవుఁ బీఁకెఁ బట్టి. 233

ఆ. వె. తూమె దొడ్లు తాను దూర్పాఱఁ బట్టిన
నేడు మొద్దు మెక్కె నెలక గుంపు
సూది పోవ నొకతె పోదె కేగఁగఁ, దన
చీఁకటి పను లెల్ల చెవులఁ బడియె! 234

కం. సఱ్ఱాజు పెళ్ళి లోపల
గుఱ్ఱాజున కొకఁడు పోఁచఁ గుదిరిచి వేసెన్
ఎఱ్ఱని కందుల పదునున
నఱ్ఱులు నిగిడించుఁ బచ్చి యారికఁ గోసెన్. 235

కం. ఏలూరి సంత కేగుచు
వేలానది, శెట్టి మునుఁగ విని యనిరి జనుల్
"ఏలకుఁ దీయుట యీతని ?
నే లాభము లేని శెట్టి యేటం బడునే ?" 236

ఆ. "భవుని రూపము ముని పత్నుల శాపంపు
రూప" మడుగ "శివుని రూపు లింగ
రూప" మనుచు శాప రూపమ్ము వర్ణించి
"నిజముఁ జెప్ప నగును నిష్ఠురమ్ము !" 237

కం. కన్నియ విడియుట కిల్లును,
సన్నాహముఁ జేయ ధనము, సన్నిహిత జనుల్
క్రొన్ననలుఁ జోనుప జుట్టును,
సన్నాసికిఁ బెండ్లిఁ జేయ శాటియు నెరవా! 238

ఆ. వె. అలుకు నింట ముగ్గు లొలికిన నది మేలు
పూలఁ బడిన మేలు కాలు జాఱి,
చేతి రొట్టె జాఱి నేతఁ బడ్డను మేలు,
పంచ దార పాలఁ బడిన మేలు ! 239

ఆ. వె. ఱైకఁ గొనఁగఁ గొంత లాభ ముండిన నేమి ?
చీరఁ గొనఁగఁ బోయెఁ జేరె డంత
సంచి పెద్ద దౌట సమకూడె లాభమ్ము
చిల్లి కూడ తీసె నెల్ల లబ్ధి ! 240

ఆ. వె. ఇచ్చు నట్టి వాని కేలరా పత్రిమ్ము ?
చచ్చు వాని కేల పెచ్చు మందు ?
ఎఱుఁక కలుగు వాని కేలరా కర్మ లి
ల్లాలు కలుగు వాని కేల వేశ్య ? 241

ఆ. వె. పోయిన కను బయిని బూయఁ గాటుకను, ము
న్నున్న కన్ను గూడ నూడి పడియె :
ఉన్న కర్మ లుండ నొక యుపాకర్మమా ?
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 242

ఆ. వె. బాల క్రొత్త దైన బడిసాల క్రొత్తదా ?
ఇల్లు క్రొత్త దైన నెలుక క్రొత్తొ ?
భక్తి క్రొత్తదైన భగవతి క్రొత్తదా ?
దేహము నవ మైనఁ దేహి నవమా ? 243

ఆ. వె. పిల్లి కనులు మూసి మెల్లఁగఁ బాల్ద్రావు
దొంగ కనులఁ బ్రామి దోఁచు ధనము
నిజము దేవుఁ డెఱుఁగు, నీరు పల్ల మెఱుంగు,
"కల్ల నిజ మగు నఁటె, కనులు మూయ"? 244

కం. కయ్యమ్ముల కామయ్యను
తొయ్యలి గయ్యాళి గౌరితో సమకూర్చెన్,
దయ్యం బయ్యారె! నెయ్యము
తియ్యము ఱాచ్చిప్ప నినుప తెడ్డును వోలెన్. 245

ఆ. వె. రాఁ దలంచిన శని రామేశ్వరము పోయి
దాఁగి యున్నను నది తప్ప నొక్కొ?
పోఁ దలంచిన ప్రాణి భూ గర్భమున దూఱి
దాఁగి యున్నను నది యాఁగు నొక్కొ? 246

ఆ. వె. కొండ నాలుక పయిఁ బుండున మందిడ
నున్న నాలుకయును నూడి పడియె
సంతతి కయి పోయి సాగరమున మున్గ
నుప్పు గాలి తగిలి ముప్పు కలిగె! 247

ఆ. వె. తిన్న యింటి వాస మెన్నెద వేలరా?
పొరుగు వారు కాళ్ళు విఱుతు రేమొ?
తిన్న యిల్లు త్రవ్వ చున్నా వదేలరా?
తినని యింటి జాడఁ గని యెఱుంగ! 248

ఆ. వె. కార్య దక్షుఁడు ఘన కార్యమ్ము సాధింప
నర్హుఁ డౌను, నీచుఁ డర్హుఁ డగునె ?
ఏనుఁగు మిథునమ్ము నిలఁ గూర్ప నేట్రింత
రాయబార మన్న లజ్జ గాదె ? 249

ఆ. వె. పిడుగు పడఁగఁ జదువబడు మంత్ర మది వేఱు,
పొత్తర నిడు బియ్యమునకు వేఱు
పిడుగునకుఁ బితరుల ఒడి బియ్యమునకును
నొక్క మంత్రమొ ? మఱి యొకటి రాదో ? 250

ఆ. వె, మొగలి వృక్షమునకు మొదట నుండును చనుల్,
తాళ వృక్షము నకుఁ దలను జనులు,
మేఁక పోతుఁ నకును మెడలోన చను లుండు
ఉవిద కురము నందు నుండు నటుల. 251

ఆ. వె. కడవ యందలి ప్రతి కబళమ్ముఁ గన నేల ?
మెతుకుఁ జూడఁ దెలియు మెత్తఁ దనము
పాఠ మందలి ప్రతి వాక్య మడుగ నేల ?
ప్రశ్న వేయఁ దెలియుఁ బాఠ పటిమ ! 252

ఆ. వె. పెద్ద పులికి యెదుటఁ బడ వచ్చునే గాని
నగరి వారి యెదుటఁ బడిన ముప్పు
పాముల గమి లోనఁ బాఱాడఁగా వచ్చు
స్వాముల గమిలోనఁ బడిన ముప్పు ! 253

ఆ. వె. మంత్రసాని యొద్ద మర్మమ్ము దాచుట
వ్యాధి మరుగు సేత వైద్యుల నొద్ద
గురుని యొద్ద జడిమ గుప్తమ్ము చేయుట
భర్త యొద్ద లజ్జ పడుట సమము. 254

ఆ. వె. అడవి పంది చేల నంత మొందింపఁగా
నూరఁ బంది చెవుల నొడిచె నొకఁడు
తిన్న కుక్క కూడు తినిపోవ, నొక్కండు
కన్న కుక్కఁ బట్టి కాలు విఱిచె! 255

కం. ఇల మృగశిర కార్తెకు లో
పలఁ బెట్టిన పాదు, ముందు బడసిన
హాలికుఁడు, నా జనకుండును, సుతుడున్
నలయఁక పూర్వంబె వారి యక్కఱ తీరున్. 256

కం. తొలి కరిని జెఱువు నిండిన?
దొలి చూలున సుతుఁడు పుట్టఁ దొలి లాభం బౌ
ఇల నలసత మడి ధున్నిన;
దల ముదరఁగ సుతుఁడు బుట్టఁ దన యిడుముల కౌ

తే. వె. తొండ మేనుఁగునకుఁ దునియ గష మదెంతొ
దోమ కొక్క తెక్కఁ దునియు టంత
కోటి శెట్టి కొక్క కోటి నష్టం బెంతొ,
బీద వాని కొక్క వీస మంత! 258

కం. పండుగకు దొలి దినమ్మున
మెండుగ గుడ్డలకుఁ గఱవు మితి మీరెడి, నా
పండుగ దినమునఁ గఱ వగుఁ
దిండికి, మఱునాఁడు కఱవు తెలి మజ్జిగ కౌ. 259

కం. గోడకు వేసిన సున్నము
వేడుక కత్తియకు నిడిన వెలగల నగలున్,
క్రోడి తిను పైఁడి వోలెను
పాడగును, హరించు, దిరిగి బడయఁగఁ దరమే ?

ఆ. వె. కోమటి పయి నున్న గొప్పదౌ నప్పును,
ఉర్వి విప్రుని పయి నున్న సంధ్య
హనుమ తోఁక వోలె నవియును పెరుగుచు
నుండు, వారి యుసురు లుండు దనుక ! 261

ఆ. వె. చుట్టుడు గల చాఁపఁ జుట్టిన న్మఱుగుచు,
విసురుడు కల తలుపు వెసను బడుచు,
పెడసరము కలిగిన పెండ్లాము వలెఁ బతి
మనసును విసిగించు మఱియు మఱియు. 262

ఆ. వె. మహిని నల్లి తోడ మంచమునకుఁ బెట్లు
అగ్ని కినుము తోడ నగును బెట్లు
ఫలములు గల వృక్షములకుఁ గట్టెలఁ బెట్లు
ఖలుల తోడ సాధువులకుఁ బెట్లు ! 263

ఆ. వె. రాత్రి మాట లెల్ల రహి నిద్ర కగుఁ జేటు
పగటి మాట లెల్లఁ బనికిఁ జేటు
మగని కగును జేటు మొగ మోడు పెండ్లాము
మనటు దివ్వె యింటి కొసఁగుఁ జేటు! 264

ఆ. వె. అన్న దేవర కడు సన్నగిల్లిన యంత
సన్న గిల్లి పోవు నన్ని మదము
లన్నఁపు మద మున్న నన్ని మదము లుండు
నాలకించు "సత్యనార్య" సూక్తి. 265

ఆ. వె. తిరిగిన వరి పొలము తిరుగకున్న నడవి
శ్రద్ధ ననుసరించు రైతు ఫలము
మ్రొక్క దైవ మగును ద్రొక్కంగ ఱాయి యా
భక్తి ననుసరించు భక్తు ఫలము. 266

ఆ. వె. ఆవుల మఱలించు నాతఁ డర్జునుఁ డగు
లంకఁ గాల్చు వాఁడె రామ భటుఁడు
రావణుని వధించు రణ యోధుఁడే రాముఁ
డాలకించు "సత్యనార్య" సూక్తి. 267

ఆ. వె. ఇద్దఱి సతుల మగఁ డిఱుకునఁ బడి చెడు
విసపురి జగడమున నిల్లు చెడును
ఉమ్మడి పసరమ్ము నొడలు పుచ్చియె చెడు
మేహ వాతము లను మేను చెడును. 268

ఆ. వె. నేఁడు ధారణ, మఱు నాఁడు పారణ యగు
నేఁడు విందగు, మఱునాఁడు మందు,
నేటి కేనుఁగు, మఱు నాటికిఁ బీనుఁగౌ
మనుజుని గతి రేపు మాపు మాఱు! 269

ఆ. వె. వినుము క్షేత్ర మెఱిఁగి బీజమ్ము జల్లిన
క్షేత్ర సారముననె చెలఁగు ఫలము
దాన పాత్రు నెఱిఁగి దానమ్ము చేసినఁ
బాత్ర మహిమ వలన ఫలము కలుఁగు. 270

ఆ. వె. కనుము తులసి వనిని గంజాయి వృక్షమ్ము
కల్ప వృక్షము కడ గచ్ఛ పొదను
చందనమును జుట్టి సర్ప ముండుటఁ గను
సుష్టు వంశ మందు భ్రష్టుఁ గనుము. 271

ఆ. వె. వాన కురిసి నంత వాతలు మానునా ?
బిడ్డ పుట్టు నంత విడునె చెడుగు ?
తలలు నెరసి నంతఁ దలపులు మానునా ?
తలలు గొఱుగు నంత వలపు చనునె ? 272

ఆ. వె. అంధకార పీడ నాదిత్యుఁ డెఱుఁగునా ?
జాత వేదుఁడు కడు శీత బాధ ?
దప్పి వలని బాధ నప్పతి యెఱుఁగునా ?
ఎఱుఁగు నొక్కొ జోలు కరవు బాధ ? 273

ఆ. వె. సంత పాక తొత్తు సన్యాసి నెఱుఁగునా ?
పూటఁ కూళ్ళ దేమి పుణ్య మెఱుఁగు ?
పెద్ద పులి యెఱుఁగునె పేరంటమును బెట్ట?
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 274

ఆ. వె. ప్రథమ కబళ మరెదె పడుట మక్షిక, లేఖ
కాదిలోనఁ బడుట హంస పదము
భువిని సప్తపాదముల వద్ద విధ వౌట
పురిటి లోన సంధి పొడమి నట్లు ! 275

ఆ. వె. దొరలు తూఁచి యొసఁగుఁ గొఱపాలు కంటెను
ధరణ యొసఁగు పాలు మెఱుఁగు కాదె?
కసరి కొట్టి పెట్టు కబళమ్ముకంటె నా
దరమున నిడు మెతు కరయ మెఱుఁగు. 276

ఆ. వె. మేలిమి వలయునఁట! మెడ దిగ వలె నంట
చొక్కపు నగ లంట! పెక్కు లంట
కోడలు విధవ యఁట! కొడుకు దీర్ఘాయువఁట!
అత్త కోర్కె లంట! రిత్త లంట; 277

ఆ. వె. పాటు కలిగె నేని కూటికిఁ గొదు వౌనె ?
రాజు తలఁప దెబ్బలకును గొదువె?
హరి తలంచె నేని ఆయువునకుఁ గొదు
వౌనె? ఆలకించు మార్య సూక్తి. 278

ఆ. వె. కుంచెడు దొరకు నని కూలి కేగ నొకండు
తూమె డొడ్లు తినెను దూడ వచ్చి
పైస కంచు వడుగు బార్వణమున కేగ
బంగరు నగ లెల్ల దొంగ దోచె! 279

ఆ. బెర! యిల్లు పొక్క నమవస యుండునా?
పొరుగు వారు పొక్క పుణ్య తిథియు?
ఊరి వారు పొక్క నుద్వాహ ముండునా?
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 280

ఆ. ఉసురు లున్న మేన నుప్పుతో మన వచ్చు
నూహ లున్న ముప్పు లోడుచ వచ్చు,
బ్రతికి యున్న బలుసు పత్రితో మనవచ్చు,
నాలకించు "సత్యనార్య" సూక్తి, 281

ఆ. ఊరివారు రాచ దారిని బోవంగ,
నులిపికట్టె పోయె నోరసిల్లి,
మును "మురారికవి" యు మూడవ మార్గముం
బట్టి పోయె నైక్యభావ మెద్ది? 282

తే. గీ. తాను గొంగళి పైఁ దించు దాని నెఱక
లెక్క డేనియుఁ దగు నటె లెక్క పెట్ట?
ఎలుఁగు బంటికిఁ దంటసం బిడఁగఁ దరమె?
మాయలోఁబుట్టు మనుజుండు మాయ కాఁడె? 283

ఆ. వె. తనదు కొంగునఁ గల తన ముల్లెయే గాని
తన కడుపునఁ బుట్టు తనయుఁ డేని
తనకు నెల్లవేళఁ దగు సహాయముఁ జేసి
అక్కఱలను దీర్త్త రెక్క దేని ? 284

ఆ. మడిని దున్ను వాఁడు మహి రాజు కాఁబోఁడు,
చేను దున్ను వాఁడు చెడఁ డెవండు !
లోటు రాదు తినఁగ రొక్క ముండదు చేత
నాలకించు "సత్యనార్య" సూక్తి. 285

ఆ. "చక్కలమును బోలి చిక్క బాలకుఁ" డన్నఁ
జక్కలముల కత్తఁడు పొక్క యేడ్చె !
"తేగ బోడు కీమె దీట" న నొక కాంత
రాగ మిడెను బిడ్డ తేగ కొఱకు ! 286

ఆ. భగ్న మగును పనులు బహు నాయకములై, యు
నాయకములును, శిశు నాయకములు,
మత్త నాయకములు, మత్తాంగనా నాయ
కములు, ప్రాజ్ఞ నాయకమ్ము మేలు ! 287

కం. ఒకచేఁ బచ్చని యక్షత
లొక చేఁ దర్భలును, దిలలు నుభయముఁగొంచున్
ఒకనికి శుభ కార్యము, వే
ఱొకనికి శ్రాద్ధం బొనర్చ నొక గురు వరిగెన్. 288

ఆ. వె. తనదు కులము వారు తన కంటె తుచ్ఛుల
యయ్యును సుమైత్రి కలిగి యుంట శుభము
తుచ్ఛమైనను దుష తొడవుగా లేకున్న
బీజ మొసఁగునె ఫల మీ జగాన ? 289

ఆ. మూడు దినముల కగు ముత్తైదు తనమున
కాలు జోళ్ళ లక్క యాకు లేల ?
ఒక్క నాటి పెండ్లి కొడలిపై; మొగమున,
నెల్ల కాటుక రేక లేల వలయు ? 290

కం. ఏ కాలు విఱిగి పోయిన
నా కాలున బిల్లి పిల్ల కది మోసంబా
ఏకడ గొట్టిన శునకము
నాకడ స్వచ్ఛంబు; కాలి కది మోసంబా. 291

ఆ. గుడిని వ్రేలు గంటఁ గొనిపోవ దొంగలు
నంబివాని కేమి నష్ట ముండు ?
సవతి కన్న కొడుకు చనిపోయి నంతకై
సవతి తల్లి కేల నొవ్వులు కలుగు ? 292

ఆ. ఈత కంటె మించు లోఁ తున్నదా, నీట ?
నురికి మించు శిక్ష యుర్విఁ గలదె ?
గోఁచి కంటె మించు గొప్ప లేవడి యేది ?
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 293

ఆ. వె. ఇనుము కరుగు చోట నీఁగకుఁ బని యేమి ?
ఊరి పెత్తనమ్ము లదుత కేల ?
పందికిఁ బని యేమి పన్నీటి గిండిలో ?
నేఁతగాని కేల కోఁతి పిల్ల ? 294

ఆ. ఇనుముఁ బట్టు చేయి పని మాని యుండునా ?
పేముఁ బట్టు చేయి విరతిఁ గనునె ?
తీఁట పట్టు చేయి తీఱిక నుండునా ?
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 295

ఆ. కథలు కల్ల లౌను, కల్పితములు నౌను
కథకు గాళ్లు లేవు, కనులు లేవు,
కాని, కథల లోనిఁ గల్పింపఁ బడు నీతి
ప్రళయవేళ దనుకఁ బ్రగతి నొందు! 286

ఆ. ఘటముఁ గొట్టి గాని, పటముఁ జీల్చియె గాని,
గార్దభస్వరమ్ము గఱచి గాని
ఏ విధమున నైన నిల లోనఁ బురుషుండు
ఘనత నంది కీర్తి గాంచ వలయు. 297

ఆ. ఔషధముఁ దినుటకు నవపథ్యమున కుద్ది,
హెచ్చు రోగముననె చచ్చు రోగి.
లంక మేఁత కేఱు లంఘించుటకు నుద్ది,
పెచ్చు కాళ్ళ తీఁత జచ్చు పశువు. 298

ఆ. వె. బ్రతుకు తెరవుఁ జూపఁ గుతుక నిచ్చును బంటు
చితుక గొట్టి కాల్ప నతుకు నినుము
ఉతుక వాని కుతుకు బితుకుఁబోఁ జాకలి
మెతుకుఁ గతుక నావు పితుకఁ బాలు! 299

ఆ. రథము నెక్కి పోయి రణమునఁ బోరాడ;
వానిఁ దలచి పార్థ! వణికె దేల?
తోటఁ దలను బెట్టి రోకటి పోటుకై
వెరువదగునె! తలను వెనుక కుంచి? 300

ఆ. ఆడఁబోవఁ బెండ్లి యాదిలో సులభమా,
బిడ్డ పుట్ట నేట బెడద పెరుగు!
రాచకార్యములును లక్షింప నాదిలో
సులభ మగును, దుదిని చూడు బెడద! 301

ఆ. పాణిపీడనమునఁ "బత్యురారోహమూ
ర్థాన" మనఁగ భార్య తలకు నెక్కె!
కామలోలుఁ డగుచుఁ గడు లాలసతఁ జూపి
"చనువుఁ జేయ, భార్య చంక కెక్కె!" 302

ఆ. "నాన్న బ్రతికి యున్న నాపితుఁ బిలిచెడి,
పిల్లవాఁడ! వానిఁ బిలచి రమ్ము"
"నాన్న బ్రతికి యున్న నాపితుఁ డేలకే?
మంగలి పనులకె! సుమంగలులకు?" 303

ఆ. వె ఎగువ కొత్తి పట్ట నది బ్రహ్మ హత్య యౌ
దిగువ కొడిచి పట్ట ధేనుహత్య
"అత్త! కొంగొసలెనె!" అన నగు నొక తప్పు
"అత్త! కొంగొసలద"టన్నఁ దప్పు. 304

ఆ. "వింటె! నాదు భార్య విగతభర్తృక" యట!
"బావ! నీ విటుండ భావ్య మగునె?
"ఏ నిటుండ గానె యిరుగింటి యిల్లాలు
విగతభర్తృక యయె వింత యేల? 305

ఆ. బిడ్డను వెనుగొంచు వెడలఁ దీర్థమునకు
బిడ్డ దేడ్చు పప్పు బెల్లములకు
పెనిమిటి వెనువెంటఁ బెండ్లి కేగఁగ రాదు
ఆలకించు "సత్యనార్య" సూక్తి. 306

ఆ. ఒజ్జ యోగ్యపత్ర మొసఁగు విద్యార్థికి
వైద్యుఁ డొసఁగు దాని వ్యాధితునకు
అనుభవరసికుఁడగు మనుజుఁడు వృద్ధుఁడో,
యువకుఁడో, కని దాని నొసఁగు యువతి! 307

ఆ. కలదె! సొంటికొమ్ము కలువనట్టి కషాయ?
మైన, బెల్లమిడని యరిసె లేని?
బలుసు,వారు లేని బలు జన్నములు గాని?
బలుసు లేని శ్రాద్ధ కర్మ గలదె? 308

కం. "బెండంతటి బావయ్యకు
కొండంతటి పెద్ద చెలియ, కూఁడునె చెప్పుమా?"
"బెండంత కత్తిపీఁటయె
పండంతటిదైన గోయు గుమ్మడి ఫలమున్." 309

## రైతుల సామెతలు

ఆ. వె. ఇహ పర సుఖములకు రహదారి యగు సహ
కార సంఘపు టధికారి వాణి
ఇహ పర సుఖములకు రహదారి యగు మహో
దేశికుఁ డొసఁగు నుపదేశ వాణి! 310

ఆ. పైరు చిక్కనైన పంటలు తక్కువౌ
వరి పలచన యైనఁ బంట పెక్కు
మంది చిక్కనైన మజ్జిగ పలచనౌ
మంది తక్కువైన మంచి పెరుఁగు. 311

ఆ. కలుపుఁ దీయని మడి, కసవు నూడ్చని గుడి;
కొప్పు పెట్టని నెఱి కురుల ముడియు,
నిజము కానిది నుడి, నెనరు లేనిది కడి,
విద్య లేని బడియు, వృధయె ఆలు! 312

ఆ. భూమి పంపకమ్మె మూలమౌ కలఁతకు,
పసుల రోగమె పలు దెసల కొఱఁత
పశువుల కొఱఁత వరి పైరునకుఁ గొఱంత,
పెంట కొఱఁతయె వరిపంట కొఱఁత. 313

ఆ. వె. మంచి విత్తనమున మించును వరి పంట
'కలితి' విత్తనమున వెలితి పంట
విత్తనమును బట్టి విత్తు పండును మెండు,
బీజ మెట్టు లుండు భూజ మట్లు. 314

ఆ. ఉల్లి యనఁగఁ బేద పల్లెల కస్తూరి,
ఉల్లి యూర నున్నఁ దల్లి యేల?
ఉల్లి చేయు మేలు తల్లియుఁ జేయునా?
ఉల్లియె పదిమంది తల్లు లట్లు! 315

ఆ. కూలి వానిఁ బోలి మేలుగఁ బని జేసి
రాజ సుతుని వోలె రోజుఁ గడపు
ఏలు వానిఁ బోలి కాలిపైఁ గాలిడి
ఆలి తోడఁ దాగు పాలు పెరుఁగు. 316

కం. "ఆర్యోక్తి సప్త శతి" నే
నార్యా! నీ కంకితముగ నర్పింతును; నా
కార్యం బవసిత మయె, నా
హార్యముఁగాఁ గొనుము దీని నంబా! లలితా! 317

శ్లో. శ్రీ 'సూకల' కులోద్భూత 'సత్యనారాయణేన' సత్
ఆర్యోక్తీనాం సప్తశతం లలితాయై సమర్పితమ్.

———

ఓమ్

# తెలుఁగు సామెతలు
# ద్వితీయ భాగము

## పంచమ, షష్ఠ, సప్తమ శతకములందలి కఠిన శబ్దములకు అర్థములు.

(1) శ్రీవిద్య=పంచదశీ మంత్రము, శ్రీమాత=లలిత, శ్రీవిద్యా దేశికుడు = మంత్రదీక్ష నొసగిన గురుఁవు, శ్రీచక్రము = లలితా యంత్రము, శ్రీవిద్యోపాసకుఁడు = లలితోపాసకుఁడు, (2) దేశ గణన = దేశములను లెక్కించుట, (4) వర భూషణములు = శ్రేష్ఠా భరణములు, మృత్తు = మన్ను, దుత్త = కుండపిడత, (5) ముదిత = స్త్రీ; వికృతి=వికారము, పరమ యోగి=మునీశ్వరుఁడు, నరపశువు = మానవ పశువు, (6) కవితా శృంగారము = కవిత్వములోని శృంగార రసము; సంగవిహీనుఁడు = విరాగి, శుకుఁడు = వ్యాసపుత్రుడు, (6) షండుఁడు=నపుంసకుఁడు, సాహితీ రహితుఁడు=సాహిత్యము లేనివాడు, పుచ్ఛ శృంగ రహిత = తోక కొమ్ములు లేని, దీర్ఘాయువు = చిరాయువు, భాగధేయము=అదృష్టము, పశు వితతి = పశు సమూహము, (9) భృంగములు=తుమ్మెదలు, ఉరగములు=సర్పములు, విబుధులు = దేవతలు, శృంగార మయము = శృంగార రస ప్రాచుర్యము కలది, (10) మధుర తరము=తీయనిది, కావ్య రసము=కవిత్వములోని రసము, దివ్య సుధ=దేవలోకమందలి అమృతము, (11) ఇక్షు దండము=చెఱుకు గడ, భిక్షు కక్షము=గుప్పిబాసి చంక, ఆర్యసూక్తి=పెద్దలుచెప్పు మంచి మాటలు: అజ్ఞుఁడు=మూఢుఁడు, మధుర రసము=తీపి, హీనము=తక్కువ (12) తరళము = చంచలము, ఘనత=గొప్పతనము, (13) అలభ్యము = పొందరానిది, భావ్యము=తగినది, (14) అర్థ భావాదులు = అర్థము తాత్పర్యము మొ॥ కౌశలము=నేర్పు, నవ్యము=నూతనము, భూషణము,

భూష=అలంకారము, భాషణము=మాట. శశిముఖి = చంద్రముఖి, (16) ముక్త = ముత్యము, శుక్తి = ముత్యపు చిప్ప, (17) అమూల్యము=వెలలేనిది, అమల రత్నము = స్వచ్ఛమైన మాణిక్యము, (18) నీరము = నీరు, వెలిగడ్డ=తెల్లని గడ్డ, (19) ధరణీశులు = రాజులు, భ్రాతృ విభజనము=అన్నదమ్ముల పంపకము. భారకారి = బరువును కలిగించునది (20) కుక్షి = కడుపు, (21) గ్రథన భేదము = గ్రంథరచన చేయు రీతి, క్రమ కోమలము = మృదుమధుర మైనది, ఆమ్ల కఠినము = పులుపు గట్టితనము కలది, ఆమ్రము=మామిడిపండు, (22) మత్తేభ శార్దూలములు=ఏనుగు, పులి, ఆపేర బరగు వృత్తములు, వనులు = వనములు, (24) ఇతవు = హితము, ఈవి=దానము, (25) ఎడఁద=హృదయము (26) వాతము = గాలి, ఆతపము=ఎండ, ఆర్య సభ్యత = ఆర్యజాతి యొక్క నాగరకత, అనివార్యము=తప్పనిసరి, కాచు = రక్షించు, (28) వారిధార=నీటిధార, (29) బడియ=కట్టె, వర రసాయనము=మంచిమందు, (30) చిలువ = పాము, నలువ=బ్రహ్మ, తులువ = నీచుఁడు, (31) లాలనము=గారాబము, తాడనము=కొట్టుట, కక్ష=పగ, (32) లబ్ధి = లాభము, (33) నుడి=సామెత, (35) స్వర్ణ ధాతువు=బంగారము, రక్త ధాతువు=సప్త ధాతువులలో రక్తము, ఘాతుకము = ఘాత చేయునది, (36) గతము=గతించినది, త్రికము=మూటి సమూహము, అనుక్రమము=వరుసగా, (37) జనపతి=రాజు, (38) ఔర్ధ్వదైహికము=ప్రేతకర్మలు, ధన విభాగము=ధనమును పంచుకొనుట, (39) ప్రబలకోపము=మిక్కిలి కోపము, ఆత్మీయుఁడు=ఆత్మ బంధువు, (40) పరపురుషా[illegible]సము=పరపురుషుడు లభింపకపోవుట, వర కారణము=గొప్ప హేతువు, (43) హుమ్మనఁ='హుం' అను ధ్వనితో సూఁకరిని పిల్చుట, 'సస్స' యనుచు = ఇస్సురనుట, హంస=జీవ హంస, (44) క్రోశ దూరము=రెండు మైళ్ళ దూరము, సంగమము = సంయోగము, (45) అశ్రుధార = కన్నీటి ధార, అంబుధార=నీటి ధార, (51) భిషక్=వైద్యుఁడు, అమాత్యుఁడు=మంత్రి

జర=ముదిమి, గణకుఁడు=జ్యోతిష్కుఁడు, గాయకుఁడు=సంగీత పాఠకుడు, గణిక=వేశ్య, మల్లుఁడు=సాముగరిడీ చేయువాఁడు, భృత్యుఁడు=సౌకరు, (52) ధావళ్యము=తెల్లదనము, (53) ఊష్మము=వేడిమి, దాయు, దరియు=సమీపించు, (54) జరాగ్ని=ముదిమి యను నగ్ని గళిత యౌవన కాష్ఠములు=జారిపోయిన యౌవనమను సమిధలు, దేహకుండము=శరీరమను అగ్ని గుండము, పలితము=నెరసుదనము, వైశ్వానరాఽగ్ని=జరరాగ్ని, దగ్ధ భస్మము=కాలిన బూడిద, (55) వార్ధక్యము=ముదిమి, అంతకుఁడు=యముఁడు, (57) నగదుఁడు=గద గలవాడు, రోగయుతుడు, దండధరుఁడు=దండముధరించువాఁడు, యముఁడు విరూపాక్షుఁడు=శివుఁడు, వికారమైన నేత్రములు కలవాఁడు, (58) శతమన్యుడు=ఇంద్రుఁడు, ముకోప్కి, కుబేరుఁడు=యక్షరాజు, వికృతములగు కనుగ్రుడ్లు కలవాఁడు, శూలి=శివుఁడు. శూలరోగము కలవాఁడు, (60) స్మృతి=మన్వాది స్మృతులు, స్మరణ శక్తి, శ్రుతి=వేదము, చెవులు, ద్విజ సమూహము=బ్రాహ్మణ సంఘము; దంతపంక్తి, విగళితము=జారిపోయినది, గోసమూహకము=ధేనుసమూహము, వాక్కుల సమూహము, (61) దీపశిఖ=దీపఁపు కొడి, (63) ద్విరద భుక్తము=ఏనుఁగు తిన్నది, కపిత్థము=వెలగకాయ, 64. మాన్యులు=పూజ్యులు, దీపకళిక=దీపశిఖ, 65. వ్యత్యయము=విపరీతము, మురహరి=విష్ణువు, 66. ఇందిర=లక్ష్మి, అచల=చలనము లేనిది. స్థిరత=స్థైర్యము, 67. గుణి=గుణము కలది, తాళ్ళు కలది, గుణగణన=గుణసమూహము, భీతహరిణి=భయమునందిన లేడి, 68. విధవ=భర్త లేనిది, ఉదార జనులు=ఔదార్యము గలవారు, ఓరసించు=ఒత్తిగిలు, సత్కవులు=మంచి పండితులు, సాపత్న్య భీతి=సవతితల్లి వలని భయము, కృపణులు=లోభులు, చపల=చంచలము కలది, 69. గోసమానులు=పశుతుల్యులు, కుజన వితతి=దుర్మార్గుల సమూహము, సతీత్వము=పాతివ్రత్యము, 70. జడులు=మూర్ఖులు, రసికులు=సరసులు, విరక్తి = వైరాగ్యము,

71. అంధులు = గ్రుడ్డివారు, సింధుపుత్రి=లక్ష్మి, పరుషవాక్కు = నిందా వచనము, విశాలాక్షుఁడు=విశాలమైన నేత్రములు గలవాఁడు, భుజగము = సర్పము, 72. తారతమ్యము= భేదము, దూరదర్శి = దూరదృష్టి గలవాఁడు, 73. విమోహకము=మోహమును కలిగించునది, స్వరూపము= నిజరూపము, షండుఁడు = నపుంసకుఁడు, 74. గురుత = గొప్పతనము, లఘుత = నీచత్వము, 75. చైతన్యహీనము = జడము, చైతన్య యుతుఁడు= ప్రాణము కలవాఁడు, మనుట = జీవించుట, 76. కులీనుఁడు= సత్కుల ప్రసూతుఁడు, దర్శనీయుఁడు=దర్శింపతగినవాఁడు, వాగ్మి=వక్త, గుణగణములు=గుణసమూహము, 77. ఛందము=చందస్సు, హుళక్కి= శూన్యము, 79. గాత్రము = శరీరము, 79. కంపము = వణుకు, హీన భావము = నీచ భావము, మరణ ముద్రలు = మరణ చిహ్నములు, అర్థి నరులు = యాచక జనులు, 80. దేహి=జీవి (ఇమ్మనుట) ధీ శ్రీలు= బుద్ధి శోభ, హ్రీకీర్తి ధృతులు=లజ్జ, యశస్సు, ధైర్యము: విష్ణుపదము= ఆకాశము, 81. తద్దామి= దాని నిచ్చెదను, అసువులు=ప్రాణములు, 83. ఆశయము=అభిప్రాయము, ప్రేరణ=ప్రోత్సాహము, ఎద = హృదయము, లగ్నము = తగులము, డోల=ఊయెల, 84. దాతృ యాచకులు = దాత, బిచ్చగాడు, ఉచ్చ నీచ తారతమ్యము = హెచ్చు తగ్గుల భేదము, సూచితము = సూచింపబడినది, 85. హాలాహలము= విషము, యాచ్ఞ=యాచించుట, గరళ కంఠుఁడు=శివుఁడు, రసజ్ఞ= జిహ్వ, 86. వామనత్వము=పొట్టిదనము, విశ్వరూపుఁడు=ప్రపంచమే స్వరూపముగా గలవాఁడు, 87. ఉరము = రొమ్ము, నిర్లజ్జుఁడు=సిగ్గులేనివాఁడు, 88. అళి=తుమ్మెద, కరి కపోలము=ఏనుఁగు గండస్థలము, అరికాపుగాయు= కనిపెట్టియుండు, 89. నిశి=రాత్రి. ఎరవు = బదలు తీసికొనుట, 90. గండతలము = గండస్థలము, 91. ఉత్స విగ్రహము = ఉత్సవము కొరకైన ప్రతిమ, మూల విగ్రహము=మూలవిరాట్టు, మూల=కోన, 92. తిమిరము = చీఁకటి, ఎఱుక=జ్ఞానము, కార్యము=చేయుతగినపని, వీర్యము=

పరాక్రమము, 93. ఉత్తమర్ణుఁడు=అప్పిచ్చువాఁడు, హోళికోత్సవము=హోళీపండుగ, కేళినల్పు=ఆటలాడు, అధమర్ణుఁడు=అప్పుతీసికొన్నవాడు దీపికోత్సవము=దీపావళి పండుగ, 95. సతి=భార్య, 96. మూఢమతి=మూఢుఁడు, బోధ=ఉపదేశము, 102. ఎలమి=వికాసము, ప్రేమ, గణనచేయు=లెక్కించు, శల్యశోధన=ఎముకలను పరిశీలించుట॥ శంకలు=అనుమానములు, అతిశంకితుఁడు=మిక్కిలి శంకలు కలవాఁడు, 106. జడుఁడు=మూర్ఖుఁడు, 107. ధార=కత్తివాయి, ఆస్వాదించు=నాకుట, 108. విష్ఠ=మలము, నటన=నటించు, 110. మరకతాలు=మరకతమణి, 112. ఎర=ఆహారము, కల్పకము=కల్పవృక్షము, ఈవి=దానము, 115. వృకము=తోడేలు, లాలనము=గారాబము, 116. కవి=పండితుడు, 117. కనకము=బంగారము, 119. వైవాహికము=వివాహ సంబంధము, విందు కుడుపు=విందుభోజనము, 122. ప్రియభోజనము=విందుభోజనము, 127. ముక్కాఱ=అడ్డబాస, 129. వనిత=ఆడుది, 130. హితులు=స్నేహిలు, 131. కవిలె=వ్రాతజాపితా 132. తారకాగణము=నక్షత్ర సమూహము, 133. ఘనము=గొప్పది 135. బలగము=సమూహము, 136. పరదైవము=పరమాత్ముడు, ఎవద=హృదయము, ఈశుఁడు=శివుఁడు, 137. ఖలుఁడు=దుర్మార్గుఁడు, 140. కొత్వాలు=పోలీసు సూపరిన్టెన్డెంట్, 145. తళియ=కంచము, 146. గుదియ=గునపము, 147. విల్పోటు=వింటిదెబ్బ, క్షుత్తు=ఆకలి, క్షుద్రవిద్యలు=నీచవిద్యలు, 151. రచ్చ పోట్లాట, 154. మూల=మూలానక్షత్రము, 155. సూర్యనమస్కృతులు=సూర్యునకు దండముబెట్టుట, మహిత భక్తి—గొప్ప భక్తి, తీర్థాటనము=తీర్థయాత్రలకు పోవుట, 15'. నర్మదాశిలార్చన=నర్మదా నదిలోని శివ బాణములను పూజించుట, భవతాపహరము=సంసార తాపమును పోగొట్టునది, 158. కించిజ్జ్ఞుఁడు=కొంచెము తెలిసినవాఁడు, శర్వుఁడు=శివుఁడు, సర్వజ్ఞుఁడు=సర్వము తెలిసినవాఁడు, 160. తండులములు=బియ్యము, 161. ధనాశలు=ధనమునందలి యాశలు

165. ఆర్తి=దుఃఖము, 166. విప్రుఁడు=బ్రాహ్మణుఁడు, 167. హిమకాంతిమంతుఁడు=చల్లని కాంతి కలవాఁడు, ఇనుఁడు=సూర్యుఁడు, 170. అమేధ్యము=అపవిత్రము178. విఘ్నపతి=గణపతి182. దువ్వలున=దుప్పటి బ్రాహ్మణ కృషి=బ్రాహ్మణ వ్యవసాయము, 188. లోలాక్షి=చలించు నేత్రములు గల స్త్రీ, ఓగిరము=అన్నము, 189. విటులు=వ్యభిచరించువారు, తమ్మిపడిగ=పీకిదాను (ఉమ్మివేయు పాత్ర), 190. తిరుమణిధారి=శ్రీచందనమును ధరించువాడు, 194. ఉభయము=రెండును, 196. కారణగుణము=కారణమునందుగల గుణము, 198. ప్రేయసి=ప్రియురాలు, కామము=కామవాంఛ, కాయము=శరీరము. 199. వంధ్య=గొడ్రాలు, కుచయుగళి=స్తనయుగ్మము, వయసు=పాలు 201. వణము=వందెము, వాదు=వాదము, 207. ఫాలచంద్రుఁడు=గణపతి, 208. దాయభాగము=పాలివాండ్రపాలు, వాత్సల్యము=ప్రేమ, 209. ధర్మప్రభూషుఁడు=ధర్మరాజు, ధార్తరాష్ట్ర పిండములు=దుర్యోధనాదుల కొరకు పిండదానములు, 210. ఉన్నతాధికారి=గొప్ప పదవిలో నున్నవాఁడు, 211. ఉబుసుపోకయున్న=ఏమియు తోచకుండిన, విగతభర్తృక=భర్త చనిపోయిన స్త్రీ, 213. తవిటిరొట్టె=తవుడుతో చేసిన రొట్టె, 215. తనయ=కుమార్తె, సుశీల=మంచి నడవడి కలది, 218. ఒడయడు=రాజు, పదవి=ఉద్యోగము, 219. దాయాదులు=పాలివారు 220. అమవస=అమావాస్య, మిత్తి=మృత్యువు, 224. ధనిక తతి=ధనికుల సమూహము, ధని=ధనికుఁడు, సతి=పతివ్రతా స్త్రీ, అధనుఁడు=ధనరహితుఁడు, రసికుఁడు=శృంగారాది రసముల నెఱిఁగినవాఁడు, 229. ప్రేమపాత్రుఁడు=ప్రేమించ తగినవాఁడు, ముక్తి పాత్రుఁడు=మోక్షమునకు తగినవాఁడు, 227. బమ్మదేవర=బ్రహ్మదేవుఁడు, 228. కడి=అన్నకబళము, హాయము=గుఱ్ఱము, బిట్టు=గొప్ప, 229. పంచాంగములు=అయిదు అవయవములు, నిపుణత=నేర్పు, సామ్యధర్ములు సమాన=మైన ధర్మము కలవారు, విత్తహారులు=ధనమును అపహరించువారు,

విధి=దైవము, 230. మనికి=జీవిక, 234. చీకటి పనులు=జారత్వము, 237, భవుఁడు=శివుఁడు, నిష్ఠురము=కఠినము, 238. సన్నాహము=సామగ్రి సమకూర్చుకొనుట, సన్నిహిత జనులు=బంధుజనులు, క్రొన్ననలు=క్రొత్త పూవులు, కాటి=కాషాయ వస్త్రము. 242. ఉపాకర్మము=శ్రావణ కర్మ, 243. నవము=క్రొత్తది, దేహి=జీవి, 245. దయ్యము=దైవము, నెయ్యము=స్నేహము, 249. కార్యదక్షుఁడు=కార్యములందు సమర్థుఁడు, అర్హుఁడు=తగినవాఁడు, 252 పాఠ పటిమ=పాఠమునందలి సామర్థ్యము, 253. నగరివారు=రాణివాసమున నుండు రాజులు, స్వాములు=ప్రభువులు, 254. మర్మము=మానము, జడిమ=బుద్ధిమాంద్యము, 256. హాలికుఁడు=దున్నువాఁడు, జనకుఁడు=తండ్రి, 257. అలసత=సోమరితనము, 258. తునియుట=తెగుట, వీసము=ఒక అణా, 260. వేఁపుక కత్తియ=ఉంపుడుకత్తె, 263. ఖలులు=దుర్మార్గులు. 264. మసటుదివ్వె=కాంతి లేని దీపము, 265. అన్నదేవర=అన్నము, 268. మేహ వాతములు=ద్వంద్వ రోగములు, 269. ధారణ=ఉపవాసము, పారణ=విందు, 270. క్షేత్రము=పంటభూమి, బీజము=విత్తనము, క్షేత్ర సారము=భూమి సారము, దానపాత్రుఁడు=దానము చేయ తగినవాఁడు, పాత్రమహిమ=ప్రతిగ్రహించువాని మహత్త్వ, 273. అప్పతి=వరుణదేవుఁడు, 275. జేఖ=ఉత్తరము, ప్రథమ కబళము=మొదటి అన్నపు ముద్ద మక్షికల=ఈఁగ, హంస పదము=హంస పాదము వలె × మార్కు వేసి అన్యత్ర వ్రాయుట, 276. కొఱపాలు=తక్కువ పాలు; 277. రిత్త=వ్యర్థము, దీర్ఘాయువు=చిరాయువు, 279. తూము=అయిదు కుంచముల ధాన్యము, పార్వణము=శ్రాద్ధము, 280. పొక్కుట=దుఃఖించుట, పుణ్యతిథి=శ్రాద్ధదినము, ఉద్వాహము=వివాహము, 281. ఒడుచవచ్చు=తీర్చుకొనవచ్చు, 282. మురారి కవి=మురారి యను పండితుఁడు, ఐక్యభావము=ఐకమత్యము, 283. ఎఱుకలు=వెండ్రుకలు, మాయకాఁడు=మాయావి, 286. దీటు=సమానము, 287. బిచ్చనాయ

కము = చాలమంది నాయకులు గలది, అనాయకము = నాయకుఁడులేనిది, శిశునాయకము = బాలనాయకత్వము, మత్తనాయకము = పిచ్చివాఁడు నాయకుడగుట! మత్తాంగనా నాయకము = మదించిన స్త్రీ నాయకురాలుగా నుండుట, ప్రాజ్ఞ నాయకము = బుద్ధిమంతుడు నాయకుఁడుగా గలది, శ్రాద్ధము = పైతృకము, 289. సుమైత్రి = మంచి స్నేహము, తుష = పొల్లు (ఊముక) ఈ జగాన = ఈ జగత్తులో, 290. లక్క యాకులు = కర్ణాభరణము, 292. నొవులు = దుఃఖము, 293. ఉర్వి = భూమి, 294. పన్నిటి గిండి = పన్నీటి గిన్నె, 295. విరతి = విశ్రాంతి, 296. ప్రళయ వేళ = కల్పావసానము, ప్రగతి = అభివృద్ధి, 297. ఘటము = కుండ, పటము = వస్త్రము, గార్దభస్వరము ÷ గాడిద అఱపు, ఘనత = గొప్పతనము, 298. అపథ్యము = హితముకానిది, లంఘించుట = దాటుట, 299. బితుకు = భయము, కతుకుట = భుజించుట, పితుకుట = పాలిచ్చుట, 300, పార్థుఁడు = అర్జునుఁడు, 302. లక్షించు = చూచు, పాణిపీడనము = వివాహము, మూర్ధానంపత్యురారోహ = భర్తయొక్క శిరస్సు నధిష్ఠింపుము, కామలోలుఁడు = కామమునందు ఆసక్తి కలవాఁడు, లాలసత = లోలుపత, 303. సుమంగలులు = సువాసినులు! నాపితుఁడు = మంగలి, 364. ఒడిచి పట్టు = లాగి పట్టు. ఒసలుట = స్థానమును తప్పియుండుట. 305. భావ్యము = తగును. 307. యోగ్యపత్రము = సర్టిఫికెట్. వ్యాధితుఁడు = రోగి. అనుభవ రసికుఁడు = రసానుభూతి కలవాఁడు. శ్రాద్ధ కర్మము = పితృకర్మ. 310. అధికారి వాణి = ఉద్యోగస్థుల ఉపదేశము. మహా దేశికుఁడు = మహా గురువు. ఉపదేశ వాణి = ఉపదేశ వచనము. 317. ఆర్య = పార్వతి. అవసితమగు = సమాప్తమగుట. ఆహార్యము = ఆభరణము.

తెలుఁగు సామెతలు సమాప్తము.

